ఆత్మారామాశ్రమ సప్తమపుష్పం :

# వ్యాసాశ్రమ వ్యాసావళి

జె. శ్రీరఘుపతిరావు
బి ఇ., యం.ఐ.ఇ.,
తెలుగుగంగ ప్రాజెక్టు.

ప్రకాశకులు :
శ్రీ సాధుగార్గిమాత
ఆత్మారామాశ్రమము
గౌతమీనగర్
కొవ్వూరు - 534 350 (ప.గో.)

1985 మార్చి. 28

వెల : రూ. 3-00

# సమ్మతి

శ్రీ సద్గురు మలయాళ స్వాములవారి ఆధ్యాత్మిక లోకమునకు చిరపరిచితులయిన సోదరులు శ్రీ రఘుపతిగారి వ్యాసావళిని ఆత్మారామాశ్రమం ద్వారా ప్రకాశింపజేయుటచే రెండు విధాల ధన్యత చేకూరినది.

శతజయంతి స్మృతి చిహ్నంగా ఎక్కడెక్కడ ఎవరెవరు ఏమేమి చేసినా అది అల్పమే యగును. ఆంధ్ర ఆధ్యాత్మికము యావత్తు శ్రీ వారికి బహుథా ఋణపడి యున్నది.

సద్గురు చలవ వలన మాతాశ్రీ నిరంజనానందగిరివారు జీవితాంతము ముప్పై సనాతన వేదాంతజ్ఞాన సభలలో మహిళా విభానికి వరుసగా నధ్యక్షత వహించిరి. ఆమె అధ్యక్షత సభలకు శోభ నిచ్చినది, తనకు కీర్తి దెచ్చినది. కృతజ్ఞతా పూర్వకంగా శతజయంతి మహాసభ కొవ్వూరులో జరుపవలెనని సంకల్పించిరి గాని నెరవేరలేదు. ఈ వ్యాసాంజలి ప్రకటన మూలమున మాతాజీ సంకల్పము దేహాంతరమున నెరవేరినదని విశ్వసించుచున్నాను.

ఇటు ఆత్మారామాశ్రమము, అటు రఘుపతి అన్నయ్య— ఇరువురు శ్రీ వారికి శతజయన్తి నీరాజన శతమానము సమర్పించి నట్లైనది. ధన్యోస్మి!

ఆత్మారామాశ్రమము
కొవ్వూరు—534350
క్రోధనఉగాది-1985

ఇట్లు
S.K. గార్గి
ఆశ్రమ నిర్వాహకులు

# వినతి

'శ్రీ మలయాళ సద్గురు చరణసన్నిధి' యను నా లేఖా రచనము చదువరుల హృదయములో మధురిమలు చిలికినదని అభినందిస్తూ శ్రీ బ్రహ్మచారి గోపాల్‌గారు 'సద్గురువాణి'కి వ్యాసములు వ్రాయమని ప్రోత్సహించిరి. సమయాన్ని బట్టి అపుడపుడు కొన్ని వ్యాసములు వ్రాసితిని. కొన్నిటిని 'సద్గురు వాణి' లోను, కొన్నిటిని 'యదార్థభారతి' లోను ప్రకటించి యున్నారు. సద్గురు శతజయంతికై వ్రాసినవి కూడ కొద్ది మార్పులతో నిందులో చేర్చితిని.

శ్రీ రాజశేఖరానంద బ్రహ్మచారిగారు—ప్రస్తుతం స్వామి వారు— నాకు బాబయ్యగారు. వారేనన్ను చిన్నప్పటినుండి ఆధ్యాత్మిక లోకమునకు పరిచయము జేసి పెద్ద జేసినది. వారి భావాలతో వారి తరుపున సద్గురు చరణసన్నిధి వ్రాసినట్లే, రెండు వ్యాసములను వారి పేర వ్రాసి ప్రకటించితిని.

నాలో భావాలు, జీవితవిధానాలు క్రమక్రమంగా మార్పుకు గురియైనవి. మార్పు ప్రగతికి చిహ్నము గదా! స్వేచ్ఛ మానవుని ఊపిరి గదా! ప్రవాహములేని నీటిలాగా విషయజ్ఞానము నిలిచి పోరాదు. తీరపు హద్దులలోనే ధర్మబద్ధమైన క్రొత్త పోకడలవసరము. ఆ విధమైన సూచనలు, వ్యత్యాసములు విమర్శలు నా వ్యాసంగములో గోచరమగును. సదవగాహనతో జూతురుగాక! అయినను నేను విషయ విమర్శ సహేతుక బుద్ధితో, సత్క్రియా చరణతో చేతునుగాని, మనుజులకు,

మిత్రులకు మహనీయులకు దూరముకాను, కాలేను. అందుకే ఇప్పటిదాక పూర్వ పరిచితులతో, పెద్దలతో, సాధుసత్పురుషులతో, మాననీయ మహిళామతల్లులతో కలిసిమెలిసే ఉంటున్నాను. కనుక మీ 'రఘుపతి'గానే నన్ను జూసి ఈ వ్యాసాంజలిని గ్రహించండి.

ఈ వ్యాసములను వ్యాసాశ్రమము వారు ప్రకటించిన బాగుండునని భావించితిని గాని వారి శతజయంతి భారాన్ని జూచి వత్తిడి చేయలేకపోయాను. 'వ్యాసాశ్రమ వ్యాసావళి' అనుపేరుతో ప్రకటిస్తామని శ్రీ విద్యానందులవారితోను శ్రీ గోపాల్ జీతోను విన్నవించితిని. విషయం ఉపోద్ఘాతముద్వారా తెలియపరుస్తూ వేసికోమని సెలవిచ్చి యున్నారు. వారల కెంతయు కృతజ్ఞుడను.

మాతా శ్రీ నిరంజనానందగిరివారు నిర్వహించిన శ్రీఆత్మారామాశ్రమము తరపున సోదరి సాధుకుమారిగార్ని ప్రకాశము జేయుటకు ముందుకు వచ్చినందుకు నా హార్దిక అభివాదములు అర్పించుచుంటిని.

శ్రీ సద్గురు శతజయంతికి దీనిని నీరాజన మణిహారముగా సమర్పించు చున్నాను. ఎల్లరూ ఆదరింతురు గాత!

నెల్లూరు | ఇట్లు
క్రోధన ఉగాది | మీ
22-3-85 | **రఘుపతి**

శ్రీ రామకృష్ణానందస్వామి
'గీతావాణి' సంపాదకులు.

# ఆ మో ద ము

జె. రఘుపతిరావు విభిన్నస్వరాల విచిత్ర సంకలనం పొందిన వ్యక్తి. అభ్యుదయ భావాలున్నాయి కాబట్టి సంస్కర్త ఆధునిక రచనలతో గద్య కవిత గేయ కవితలను, పాణిగ్రహణం చేశాడు. పానుగంటివారు తమ "సాక్షి" లో 'కవి ముదిరితే పిచ్చివాడ'ని అన్నాడు. కాని, యీయన 'సద్గురు చరణ సన్నిధి' ప్రభావంతోనేమో అంత ముదురు పాకంలో పడలేదు. గేయ కవిత సాధు జనతాలోకానికి 'జనతాబండి' అయింది. భావంలో వడివుండి; భాషలో నుడికారం వుంది.

"జ్ఞానములేని నీతి బలహీనము; నీతిలేని జ్ఞానము ప్రమాదకరము" – అనే యీలాంటి వాక్యాలు చింతకులు తమ చింతనతో సొంతం చేసుకొనవలసిన మాటలు.

ప్రధానంగా 'సద్గురువాణి' 'యదార్థభారతి' లోని వ్యాస సంకలన సంపుటి యీ చిన్న గ్రంథము. తటస్థ భావంతో చదవండి. ఆవశ్యక సామగ్రిని అందుకొండి. వీరి ప్రయాణం శాంత గంభీరశీతనగ శిఖరాధిరోహణం చేయించుగాక। చిరకాల మిత్రునికి యివే నాకోరు శుభాకాంక్షలు, శుభాశయాలు.

ఓం (సం.) శ్రీ రామకృష్ణానంద

# వ్యాస సూచిక







# అందము - ఆనందము - ఆశ్రమము

-జె. శ్రీ రఘుపతిరావు

అందమె ఆనందం
ఆనందమె ఒక సంద్ర.!
ఆత్మీయపుటానందపుటలలు
అలముకొన్నవి ఆశ్రమమంతట!
అవును గదా! ఇది శతజయంతి — సద్గు
రువు గదా! మన మధ్యనుండినది!!

1. మనవిక్షేపావరణలు తొలంగి
మనసు శుద్ధి సంబుద్ధిని కలిగి
మనిషికి మిత్రమై హృదిలో వెలిగి
మనుగడలో మధువును పరిచిలికే! అందమె

అయ్యలార! అద్భుత జయంతిసభ
అందులకే ఆనందపు శోభ!

5 కూరిమి తాలిమి ఓరిమి కుదర
కలిమి బలిమి చెలిమి తెలివి ముదర
వేదన రోదన శోధన చెదర
మాలిమి మేలిమి శీలము గదిరే! అందమె

అమ్మలార శతవత్సర జయంతి
అందుకొనుడి సద్గురునికి హారతి

3. అందానికి ఆటపట్టు హృదయము
అందగుపడు సద్గురు ప్రతిబింబము
అందరిలోనది దయారూపము
ఎందరికో ఆనంద బంధురము। అందమె
అందాలొలికే ఆనందోత్సవం
ఆనందోత్సవ శతవత్సరము।

## "దయగల హృదయమే భగవన్నిలయము"

శ్రీవారి సూక్తి ముక్తావళిలో మకుటాయమానమైనదీ మహావాక్యము. దైవము యొక్క ఉనికిని, స్థితిని, అస్తిత్వమును ప్రకటించు ప్రమాణ వాక్యము. ఇది భగవద్విషయమైన మహత్తర వ్యాఖ్యానము. దేవుడున్నాడా లేడా, సగుణుడా, నిర్గుణుడా, ఎక్కడెక్కడున్నాడు అనుదానికి అనుభవ పూర్వక సమాధాన వాక్యము. భగవానుని, మానవుని, మానవగుణ విశేషమును ముడి పెట్టిన మనోజ్ఞ మంత్రరాజము, ఇది నిత్యనైష్ఠిక జీవన త్రిపుటి. ఆదర్శ ఆదేయ దివ్యసూత్రము శ్రీమలయాళస్వాములవారి సహిత జీవిత విధానము.

ఇందు దయ, హృదయము, భగవంతుడు అని మూడు పదములు గలవు. మానవ మాత్రునకు కావలసినది దయ దయానుభూతికి స్థానము హృదయము. కనుక హృదయమును గూర్చి అధ్యయనము జేయుట అవసరము. శాస్త్రిదృష్టితోను, సహేతుక బుద్ధితోను, స్వానుభవ పూర్వక ముగను సుతిర్కించుట శ్రేష్టము.

అనేక గ్రంథములలో హృదయమునకు మనస్సు, చిత్తము, అంతరంగము అని అర్థమివ్వబడినది. అయితే మనస్సు, హృదయము అనునవి ఒక్కటేనా లేక వేరైనవాయని వివరముగ తర్కించుట కూడ యావశ్యకము

హృదయ శబ్దము హృద్–హృదు అని తెలియనగును. హృద్–అయ్యతే–హృదయః, హరణమును పొందించునది హరణమనగా దేనినైనా లేక ఏవిషయమునైనను హరించునది. స్వీకరించునది, గ్రహించునదియని శబ్దార్థము ఉన్నది ఉన్నట్లుగా గ్రహించేది యని కూడ చెప్పవచ్చును.

భావార్థమున భావించేది హృదయమన వచ్చును, అనగా అదియే అనుభవించేది. ఎప్పటి కప్పుడు అనుభవించునది. ఇది వర్తమానానికి సంబంధించినట్టియు, నిత్య జీవితమున కవసరమైనట్టియు ప్రక్రియ అర్థమగుట దాని లక్షణము తేట తెల్లముగ, నిర్మలముగ, అమాయకముగ నుండేది హృదయము. జాలి, కనికరము జూపుట,గమనించుట ఉప్పొంగుట దాని సహజ గుణము. హృదయముప్పొంగినపుడు కండ్లు చమ్మగిల్లును. అపుడు తక్షణ కర్తవ్యమేర్పడును. మార్పు కాయత్తమగుటకు–బాధ్యత నెరవేర్చుటకది దోహదపడును, దయ–దాక్షిణ్యము, మార్దవము మాధుర్యము ప్రేమ–కరుణ మున్నగు సాత్విక సుగుణ పుంజమునకు స్వస్థానము హృదయము.

మానవునిలోని దేహ విషయమును భౌతికమని, చింతనా విషయమును మానసికమని, ఆత్మవిషయము నాధ్యాత్మికమని విభజిస్తారు ఈ విభజన ప్రకారము హృదయమనుదానినేవిధముగా పరిగణింప వచ్చును?

బృహదారణ కోపనిషత్తు భాష్యములో హృదయమన వర్తులాకారమైన మాంసపిండమని శంకరాచార్యులవారు చెప్పియున్నారు. దానియందుండేది అంతర్జ్యోతి పరమాత్మయని, దానినే బ్రహ్మయని, ఆకాశమని చెప్పిరి. ఇది గుండె (హార్టు) వలె రొమ్ము క్రింద నుండే మాంస భాగము కాదు గదా! కాదు! కాదు.... గుండెలో లోలోపల ఏమూలనో శూన్యంగా, ఖాళీగానున్న ఆకాశమే అది "దహరాయె ధ్యనగరు" "హృద్దే శోర్జున" హృదయంకాదు ; హృత్ దేశము, కావచ్చు అది భౌతికములో నొక భాగము, భౌతికమే దాని కాధారము, ఆదిభౌతికము.

మనసుకు సంబంధించినది మానసికము–అన్నమయం మనః అన్నారు మనస్సు అన్నమయమైనది. మనస్సు ఆహారంవల్ల వృద్ధి అవుతుంది. ఆహారం లేకపోతే క్షీణించటం, స్పృహ తప్పటం గమనించుచునే యున్నాము. "అన్నమయంహిసోమ్య! మనః" అని మహర్షి శ్వేతకేతునకు జెప్పెను (ఛాందోగ్యం).

"అన్నంపుంసా శితంత్రేధా జాయతే జఠరాగ్నినా!
మలం స్థవిష్ఠో భాగస్స్యాన్మధ్యమో మాంసతాంవ్రజేత్॥
మనః కనిష్ఠో భాగస్స్యాత్ స్మాదన్నమ యంమనః॥

సూక్ష్మ భాగం మనస్సగును-అనిసూక్ష్మత్రు చెప్పినది అవిధంగా మనస్సుకూడ భౌతికమైనదే, పంచభూతములవల్ల నేర్పడినది యని తేలుచున్నది. ఆలోచన –(థాట్)–లేకస్మృతి భౌతిక–రసాయనిక చర్యయని విజ్ఞానశాస్త్రం నిరూపిస్తున్నది. దాని కాధారమైన మనస్సు కూడ అంతే గదా!

కనుక శరీరంతో చేసేపని నికృష్టము మనస్సుతో చేసేపని శ్రేష్ఠము అనరాదు, భౌతికములో మార్పులు, హెచ్చు తగ్గులు-స్థూలము-సూక్ష్మము —అతిసూక్ష్మము అని చెప్పవచ్చు నేమోకాని అసలు భౌతికముకాదని చెప్పలేము. భౌతికమునకు వ్యతిరేకమైనది, వేరైనది, పరమైనది. అని చెప్పుటకు శక్యముగాక యున్నది.

మననము చేసేది మనస్సు- యోచించేది మనస్సు; చింతించేది మనస్సే —సంకల్పించేది, నిశ్చయించేది ప్రకాశింపజేసేది, అహంకరించేది మనస్సు. ఆ క్రియలనుబట్టి వరుసగా మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అని ఒకే వస్తువును వేరు వేరు పేర్లతో గుర్తించు చున్నాము. ఈ నాల్గింటిని అంతఃకరణ చతుష్టయమని కూడ అంటారు. ఇవి లోపలి ఇంద్రియములు. కరణమనగా ఇంద్రియము — 'మనషష్ఠాణి' అన్నపుడు మనస్సు ఆరవ ఇంద్రియమని పేర్కొన్నారు. పంచేంద్రియములతో పాటు ఆరవది కూడ భౌతికమనే గుర్తించితిమి.

మనస్సుయొక్క ఉత్పత్తిని స్థితిని గ్రహించవలెను. మనిషి కనుగుణ్యముగ దాని స్థితిని, గతిని మార్చుకోవలసి యుంటుంది. ప్రతిబింబముల రాశిగానది వృద్ధిజెందును గ్రహించిన వాటిని నిలువజేసికొంటూ గతానుభవంతో పునఃసృష్టి జేసికుంటూ పోతుంది. గతస్మృతుల యాధారంతో ఊహాత్మకంగా వృద్ధిజెందుచుంటుంది. ఆలోచనే దాని ఊపిరి-విధి విధానము —వినోదము, గందర గోళ చిందర వందర ముద్రాబంధురము. వాస్తవ అవాస్తవ విరుద్ధవస్తు భాండారము. ప్రమాద భరితము, చలన సంయుతము. భార పూరితము సంకీర్ణ బంధనము. సంక్లిష్ట స్పందనము. సమ్మోహ కారణము. విజ్ఞానమునకు మూలము. నిత్యజీవన చైతన్యము. బోధనోప

కరణము. ప్రధాన కరణము దీనికి స్థానము కపాలము. మేధ దీనికి పునాది. బ్రెయిన్ సెల్స్ ప్రాణము.

ఆలోచన జీవనకళ. అనుభూతి జీ వి త ము. మనస్సు సంకల్ప వికల్పములను కలుగుజేయును. హృదయం ఆ న ం ద ము ను దుఃఖము ననుభవించును ఒకటి వినోదమును విజ్ఞానము నిచ్చును. రెండవది వాస్తవ మును, కర్తవ్యమును జూపును.

మనో ప్రక్రియలగు విషయ పరిగ్రహణము, విజ్ఞానార్జనము వినోద వ్యసనము. విస్తృత హేతు దృక్పథము, ప్రగతిశీల విచక్షణము మానవ జీవితమున కెంత అవసరమో హృదయోత్పాదనములగు కర్తవ్యపాలన, వాస్త వానుభవము, నైతికపాలన, పరోపకారము, స్నేహము, సహకారము, కనికరము, జాలి, ప్రేమ, కరుణ జీవితమున అంత అవిలంఘ్యనీయాంశ ములు బుద్ధివిశేషత ఎంత యవసరమో, హృదయ వైశాల్యత అంత అవసరం. బుద్ధి వికసించాలి. హృదయ ముప్పొంగాలి బుద్ధి వికాసము పాండిత్యమును, జ్ఞానమును, తెలివి తేటలను పెంపొందించును. హృదయ వికాసము పూర్ణత్వ మును, బాధ్యతను కరుణా ప్రవృత్తిని వృద్ధిజేయును. మనసు మాత్రమే పెరిగిన మాటల గారడీ మి గు లు ను. హృది మాత్రమే పెరిగిన స్తబ్దత కల్పించును. ఒకటి వ్యక్తిత్వమునకు ప్రాధాన్యతనిస్తే రెండవది మానవత్వ మునకు ప్రాముఖ్యత నిచ్చును. స్వార్థపూరిత మొకటి, పరోపకార ప్రేరకము మరొకటి, బుద్ధి, హృదయము సమపాళ్ళలో పెంపొందాలి. రెంటి యొక్క ఉన్నత శిఖరాల నాకళింపు జేసికొన్నవాడు మాత్రమే మేధావంతుడగును. మేధావి తనకు, లోకానికి మేలు జేయును, ప్రపంచమునకే మేల్కొల్పు, బుద్ధుడు, క్రీస్తు, వివేకానందుడు, అంబేద్కరు ఆకోవకు జెందినవారు.

జ్ఞానము మనసుకు సంబంధించినది. నీతి హృదయానికి సంబంధించి నది. అయితే జ్ఞానములేని నీతి బలహీనము, నిరుపయోగమునైనది, నీతిలేని విజ్ఞానము ప్రమాదకరము, భయంకరమైనదన్నారు. శామ్యూల్ జాన్సన్ ప్రేమ సంపాదించే వస్తువుకాదు. ప్రేమంటే ఏమిటని ఒక ప్రశ్న వేశారు. దానికొక పిల్లవాడిట్లు సమాధానం చెప్పారు. "మెరటు ప్రశ్నలకు మృదువుగా సమాధానం చెప్పేదే ప్రేమ" అది హృదయ ధర్మము.

మంచి చేయుటకు చూడుము: మంచి చూడబడుటకు చేయకుము. మంచి తనము లేని తెలివి పెద్ద దుర్లక్షణము. ఆ మంచి తనము హృదయము నుండి ఉత్పన్నమగును.

మనో హృదయములు వేరు వేరుగా గన్పట్టినను పరస్పర పూరకములు. సమ్యగ్ క్రియానుభవం పొందుటకుగాను మనో హృదయముల నేకోన్ముఖము జేయుటెంతేని యవసరము అందుకుగాను మనసు హృదయము యొక్క స్వాధీనములో నుండునట్లు జాగ్రత వహించదగును. ఎట్లన మనో ద్విరేఫమును హృదయ కమలములో స్వేచ్ఛగా, సహజముగా ప్రవేశపెట్టిన జీవన మాధుర్యం మానవుని మత్తెక్కించి తన్మయానంద మొసంగును.

హృదయ సంపద వృద్ధి జెందునుగాక!
ఇది శత జయంతి నీరాజన విజయఘోష!



# సంస్కృతి - ఆధ్యాత్మికత

చరిత్ర సృష్టికి కారణ మెవరు అని ఒక విచారణ యున్నది. దాని కనేకమంది అనేక విధాలుగ వివరించారు, ముఖ్యులైన వారి అభిప్రాయాల సారాంశ మీ విధముగనున్నది. చరిత్ర గతికి దైవేచ్ఛయే కారణమని 'ఆగస్టిన్' మహాశయుడు భావించాడు. భౌతిక, భౌగోళిక పరిస్థితులని 'బకిల్ మహాశయుడు వక్కాణించాడు. ఆర్థిక శక్తులే కారణమని కమ్యూనిజమ్ సిద్ధాంతి 'కారల్ మార్క్స్' తెలియజేశాడు. వ్యక్తియే చరిత్ర సృష్టికి కారణమని నవభారత రాజ్యాంగ నిర్మాణ డా॥ బి. ఆర్. అంబేద్కర్ వ్యక్తపరిచాడు. ఈ చివరి అభిప్రాయము భారతీయ ఆలోచన అనుగుణ్యంలో కన్పించుచున్నది. అయితే భారతీయ పూర్వీక చరిత్ర కొంత లోతుగా సింహావలోకనము చేస్తే ఆధ్యాత్మిక సంపన్నులైన వ్యక్తుల అనుభవాల ననుసరించి సామాజిక స్థితిగతులు పరిణామము చెందు చున్నవని అవగతం కాగలదు. వారినే మహనీయులని, మనీషులని, మహాత్ములని, మ హా పు రు షు ల ని, మహర్షులని, మార్గదర్శకులని, ధర్మవేత్తలని, వేద విదులని, స్మృతి కారులని పేర్కొన్నారు. వారి జీవితాలు, ప్రబోధాలు గ్రంధాలు ప్రజకో మార్గదర్శకము లైనవి, వాని ననుసరించి సంఘ ధర్మము వర్ధిల్లినది. వ్యక్తుల నాధారంగా జేసికొని వృద్ధిచెందిన సమాజముల పరిణామముల ననుసరించి చరిత్ర సృష్టించ బడినది. చరిత్రకు వెలుగు ప్రసాదించినదే సంస్కృతి.

సంస్కృతి యనగా సంస్కరింప బడినది. సంస్కరింప బడిన ఆచారము. సంస్కరింపబడిన సమగ్ర మానవ జీవిత వర్తన. దీని నింగ్లీషులో కల్చర్ అంటారు. కల్టివేట్ చేయబడినది. అనగా అభ్యాసము చేయబడినది' అలాంటి సంస్కృతి నుండి ఉద్భవించినదే నాగరికత. అందుకే ప్రవర్తనా సౌందర్యమే నాగరికత అని రవీంద్రనాథఠాగూరు వ్యాఖ్యానించారు.

భారతీయ సంస్కృతి అనగా ఆధ్యాత్మిక సంస్కృతియని చెప్పకనే స్ఫురించగలము. పశ్చిమదేశాలు అధి భౌతికము యెడ మక్కువ చూపగా, తూర్పు దేశములు ఆధ్యాత్మికము యెడ ఆసక్తి గనపరచినవి "శరీర మాద్యంఖలు ధర్మసాధనం" అని చెప్పినా, శరీరమునకన్న మిన్నయైన విలువను ఆత్మకు యిచ్చినారు. ఆత్మజ్ఞానము ఆత్మయే పరమాత్మయని, అది అఖండమని, అది సర్వాధారమని, అది సర్వవ్యాపకమని, అది ఆనంద నిలయమని శాంతి దాయకమని, అదిగాక వేరెద్ది లేదిదని, తదనుభూతికే ఆధ్యాత్మిక సాధన అవసరమని విజ్ఞుల బోధన...... అట్టి ఆధ్యాత్మిక జ్ఞానముతో కూడిన ప్రవర్తనయే మన సంస్కృతికి మూలమని అది భారతీయ సంస్కృతియని తెలియబడుచున్నది.

మన ఆధ్యాత్మిక సంస్కృతి వేదముల నుండి. ఉపనిషత్తుల నుండి గ్రహింపబడినది. "ఏకమే వాద్వితీయం" అన్నదాన్ని పరమ ప్రమాణ సత్యంగ ప్రబోధించిన వేదోప నిషత్తుల కాలంలో సంస్కృతి అవిచ్ఛిన్నంగా నున్నదనే చెప్పాలి. అనగా జనులందరి యెడ ఉదారంగా, సమానంగా, సహేతుకంగా నున్నదన వచ్చును. అది శ్రుతి కాలము. క్రమంగా స్మృతి కాలము వచ్చినది. కాలం మార్పుతో సంస్కృతికి మార్పు వచ్చినది. శ్రుతి కాలంలో శ్రమ విభజన వర్ణ నిర్ణయమునకు కారణమైనది· స్మృతి కాలంలో శ్రమజీవుల విభజన జన్మ విభజనకు దారి తీసినది- పురాణేతి హాసకాల మానన్న మననాటికి జన్మతః వర్ణవ్యవస్థ స్థిరపడినది. సంస్కృతి కూడా పూర్తిగా వర్ణాశమ ధర్మాలతో కట్టుబడి పోయినది. క్రమంగా వర్ణాశ్రమ ధర్మ పాలనయే మన సంస్కృతి యనబడినది. వర్ణాశ్రమ ధర్మములు తు.చ. తప్పక పాటించుట భగవదాజ్ఞయని భాష్యములు వెలువడినవి. భగవదేచ్ఛను గ్రహించి మసలుటయే భక్తియని ఆస్తికతయని చెల్లుబడియైనది. ఈస్థాయిలో

ఆధ్యాత్మికత సంస్కృతి సమ్మేళనమైనది. నిప్పు, ఇనుము రెండు ఏక మగుటచే సమ్మెట పోట్లకు సరియైనట్లునది.

చరిత్ర గతి ననుసరించి సాంఘిక పరిస్థితుల మార్పునుబట్టి సంస్కృతి మారుచుండును. ఒకనాడు ఆధ్యాత్మికతను ఆసరాగా జేసికొని పేరెన్నిక గన్న భారతీయ సంస్కృతి ఈనాడు వర్ణవ్యవస్థతో ముడిపడి కీలకపాత్ర పదికకు దిగజారి సంకోచితమై పోయింది. కట్టు, బొట్టు, జుట్టు మనసంస్కృతి చిహ్నాలై పోయినవి. విధి నిషేధాలు పాటించుటే సంస్కృతియైనది. సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలే సంస్కృతికి కొలత బద్దలైనవి. కుళ్ళు, కంపుకొట్టుచున్న కులవ్యవస్థలాగే, మేడిపండువలె తయారైంది మన సంస్కృతి, జన్మత: తయారైన కులవ్యవస్థను మార్చి, గుణ కర్మానుసార వర్ణవ్యవస్థగ సంఘాన్ని ఎలా ప్రస్తుతం తీర్చిదిద్దలేమో, కులప్రాతి పదికగా తయారైన సంస్కృతి, ఆధ్యాత్మిక సంస్కృతిగా మార్చటం కూడ సాధ్యం కాదు, సరియైన మార్గం కూడ కాదు

అయితే మనమను సరించవలసిన సంస్కృతి ఏది? మన కనుగుణ మైన సంస్కృతి ఏది? హేతుబద్ధమైన జీవనమే ఒక సంస్కృతిని సృష్టించ గలదు. మారుచున్న సాంఘిక, ఆర్థిక పరిస్థితులను బట్టి క్రొత్త సంస్కృతి యేర్పడ గలదు. కనుక వ్యక్తియొక్క, సమిష్టి యొక్క ప్రవర్తన ఎట్లుండ వలయుననేదే ప్రశ్న. స్వాతంత్ర్యం, సమానత్వం, న్యాయం అను నాల్గు స్తంభాలపై రాజ్యాంగ చట్ట భవంతి నిర్మితమై యున్నది. ఆరాజ్యాంగ చట్టమే మనకు నేటి ధర్మ శాస్త్రము. దాని ననుసరించుటచే యేర్పడిన సంస్కృతియే సంస్కృతి సమసమాజ నిర్మాణమునకు తోడ్పడు నదియే మనకు వలసిన సంస్కృతి. (మార్పు ప్రగతికి చిహ్నము ధర్మశాస్త్ర ప్రకారం సర్వులకు

సమానత్వం, సమానావకాశలు, లభించ వలయుననియు ముఖ్యంగ స్త్రీలకు శూద్రులకు సమాన అధికారములు లభించ వలయునని మహర్షి సద్గురు శ్రీ మళయాళస్వాములవారు ఆధ్యాత్మిక రంగంలో కృషి చేసారు. ఆయన ఆదర్శ భావంలో అన్ని రంగాలకు వ్యాపించ వలయునని జీవితంలో సమగ్ర సమత్వం లభించాలనియు సర్వప్రజ ఏకోన్ముఖంగా యత్నించాలని ఆశిద్దాం!) (సద్గురువాణి–అక్టోబరు 1979)

# మతము – కులము – అస్పృశ్యత

–జె. శ్రీరఘుపతిరావు BE. MIE.

1982 ఏప్రిల్ సద్గురువాణి సంచికలో మతం – అస్పృశ్యత గూర్చి చక్కని సంపాదకీయమును వ్రాసియున్నారు. అస్పృశ్యతకు వేర్పాటు ధోరణులకు తక్షణం తిలోదకాలివ్వాలని స్పష్టం చేశారు. మతం అంటే అభిప్రాయమనియు, ఉత్తమ లక్ష్యప్రాప్తికి సాధకమైన ఒక జీవన విధానాన్ని బోధించే ధర్మసముచ్చయమనియు సెలవిచ్చారు. ఎంతయు అభినందనీయము.

ఏతదభిప్రాయమును బలపరచుటచుగాను నా అభిప్రాయము విచ్చట బయలుపరచుమన్నాను. ఏ అభిప్రాయమైనను మున్ముందుగా మానవుని అవసరాన్నిబట్టి అభివృద్ధి గోరి ప్రారంభమగును. దానికి చాల పరిమితమైన అర్థము, పరితమైన ప్రయోజనము ఉండును. దాని వ్యాపకము కూడ పరిమితముగానే యుండును. అయితే పరిమితముగ నున్నప్పుడు ప్రయోజనము యొక్క పర్యవసానము గూడ తేలికగ తెలుసుకొన వీలగును. ఒక అభిప్రాయముగానీ, విధానముగాని, సిద్ధాంతముగాని అపరితమైనచో, లేక

విపరీతమైనచో అది విధేయత లక్ష్యానికి బహుదూరమగుటయేగాక విపత్కర-ఫలితాలకు దారితీయును. ఇది మన సాంప్రదాయిక సిద్ధాంతానుసరణలో సాక్షాత్కరిస్తున్న సత్యము.

మతమనునది తెలియని వస్తువును లేక విషయమును గూర్చి చింతించే విధానము, తెలియని దానిని తెలుసుకొనే నిమిత్త మేర్పడిన మార్గము. ఆ తెలియనిది మహోత్తర శక్తియని, విశ్వానికి ఏకైక నిర్దేశక శక్తియని ముందుగనే భావించుట జరుగుటచే దానికి తెలియనెంచిన మార్గము కూడ మహత్తరమని యెంచబడినది. ఇచట తెలియనిది, దేవుడు, తెలిసికొనుటకు సాధనమైన మార్గము మతము.

కులమనునది సాంఘిక కట్టుబాటు ఇది మనుజుల బాగోగుల దృష్ట్యా యేర్పరచుకొన్న సామాజిక విధానము. సామాజిక శ్రేయస్సు కోరి యేర్పరచుకొన్న జన విభజన, ఇది వాస్తవమైనది ఊహాజనిత విషయముతో సంబంధములేనిది. భారతీయ ఆర్యవ్యవస్థయైన వర్ణాశ్రమ ధర్మాలకు జన్యమైనది.

వర్ణమనగా రంగు, రంగునుబట్టి గుర్తింపునకై మనుష్యులను కొన్ని సంకేతములతో విభజించుకొనుటయైనది. తెల్లని వాని బ్రాహ్మణుడని, ఎఱ్ఱనివాని క్షత్రియుడని, నల్లనివాని వైశ్యుడని, మిశ్రమ వర్ణుని శూద్రుడని నిర్ణయించియుందురు. ఈ మిశ్రమ వర్ణాన్ని కాలక్రమేణ బానిసలకు గుర్తుగా నిర్ణయించియుందురు. ఎందుచేతనన యుద్ధమందు తమచే ఓడింపబడినవార్ని బానిసలుగ జేసి, వారికి సేవకవృత్తి నప్పజెప్పినట్లుగలదు. పైరీతి ననుసరించి మనుష్యుల రంగు స్పష్టముగ నుండక పోవుటచేతను, మిశ్రమ వివాహము

లకు, లేక జంటలకు పుట్టిన బిడ్డల వర్ణము స్పష్టముగ విభజనకు కుదరక పోవుట చేతను, రంగును బట్టి, వర్ణవిభజన కష్టమై గుణ విభజనద్వారా వర్ణవిభజన చేయబూనిరి. ఒకే మనిషి గుణము అనేకమార్లు జెందు చుండుట చేతను, ఒకరిలోనే మిశ్రమగుణా లనేకం యేర్పడుట చేతను గుణవిభజనకు కూడా ఒక నిర్దుష్టత లేక వృత్తి విభజనచే స్వధర్మము ఏర్పడి కుటుంబపరంగా లేక వంశ పారంపర్యముగా యేర్పడిన వృత్తి విభజనమే జన్మ విభజనకు దారి తీసినది.

జన్మవిభజన హేతుబద్ధముగ లేకపోవుటచే, ఇష్టత, సమర్థత ఉన్నను తగిన వృత్తిని గ్రహించుటకు వ్యక్తికి స్వాతంత్ర్యత లేక పోవుటచేతను, జనులకు సమానావకాశములు లేక పదవకాశములు లేక జన్మవిభజనను ఆక్షే పించి, గుణకర్మ విభజన మేలనిరి, గుణ కర్మ విభజనకూడను సిద్ధాంతా న్ననుసరించి ఆచరణాత్మకము కాలేకపోవుటచేతను సార్వజనిక నిర్ణయ సంఘ మేదియు లేకపోవుటచేతను, అది నిర్ణయాత్మకం కాలేక లోపభూయిష్ట మైనను జన్మవిభజనయే స్థిరపడినది. ఈ చాతుర్వర్ణ్య సిద్ధాంతం ప్రాథమిక దశలోను, ప్రస్తుత వ్యవహారస్థితిలోను జన్మకారణంగా జనుల విభజన చేయుచున్నది.

ఇకపోతే పంచమ వర్ణమునకు రంగు విభజనగాని, కర్మవిభజనగాని, గుణకర్మ విభజనగాని, గుణకర్మ వర్ణవిభజనగాని ఏదీ కారణముకాదు, కేవలం వెలి; వెలి; వెలి; శూద్రపురుషులు బ్రాహ్మణ స్త్రీలను కలిశారన్న నెపముతో వారి బిడ్డలను గ్రామ బాహ్యులుగా జేసారు. బ్రాహ్మణస్త్రీకి,

శూద్ర పురుషునకు, జంటతనమువల్లనో, ప్రేమబంధమువల్లనో వివాహము వల్లనో, పుట్టిన సంతానమును చండాలురని చీత్కారముచేసి వారికి అంటరాని తనమును అంటగట్టి, వెలివేసి ఊరు వెలుపలికి తరిమారు, వారే పంచములు, నాల్గు వర్ణముల వారిలో ఎవ్వరును జేయని గౌరవహీనమైన, నికృష్టమైన, నీచమైన, నిందా పూర్వకమైన వృత్తులేదైనా వాటిని పంచములు చేసికొన వచ్చును. పైగా వారి శ్రమవల్ల వచ్చే ప్రయోజన మేదైనా ఉంటే నాల్గు వర్ణముల వారికి చెందాలి. ఇది పంచములకు విధించిన సామాజిక న్యాయము. ఇదియే ధర్మభూమిలోని అధర్మము, కర్మభూమిలోని దుష్కర్మము; పవిత్ర భూమిలోని అపవిత్రత, పుణ్యభూమిలోని పాపము; ఆధ్యాత్మిక సీమలోని ఆత్మక్షోభము.

అయితే చాతుర్వర్ణ్యస్థులకు వలెనే పంచమ జన్మస్థులకు కూడ జన్మ విభజనయే సహజ సిద్ధాంతమైనది. ఈ విభజనవల్ల ఒకరికంటె ఒకరు గొప్ప అనే నిచ్చెనమెట్లు పద్ధతి సంఘం మొత్తంలో యేర్పడినది. వంశాచారము వల్లను వివిధ కౌటుంబిక నియమాల వల్లను ఆహార విహార వ్యవహార వివాహాది విధానములలో మార్పువల్లను ఒకే వర్ణములో అనేక కులములు విభాగమైనది. మొత్తము మీద హైందవ సమాజములో లెక్కకు మించిన కులాలు, ఉపకులాలు, గుట్టలు గుట్టలుగా, చెదల పుట్టలుగా పెరిగిపోయినవి. తద్వారా వృత్తి విభజనయేగాక, ఒకేజాతికి చెందిన మనుషులనే విభజింపవలసి వచ్చినది. ఇవి మార్పుజెందే సాంఘికాచారములు, కాలక్రమేణ ప్రగతిశీలక సమాజంలో వీటి విలువ తగ్గి శీఘ్రమే నసిసిపోయినను చింతించవలసిన పనిలేదు, కాని ఈ కులవ్యవస్థ మార్పు జెందకుండుటకుగాను, సామాజిక, వర్ణధర్మాన్ని మతబద్ధం చేశారు. అది దైవదత్తమన్నారు. అదే ప్రమాద హేతువు. కాలాత్మకమైన, సామాజికమైన వృత్తి విభాగములేక జన్మవిభాగము

భగవన్నిర్ణయమన్నారు, శాస్త్రాల కెక్కించారు. శాస్త్రాలు సనాతన ధర్మ సంహితలన్నారు, కనుక కులాలు శాశ్వతం కావాలన్నారు.

ఇక అక్కడనుంచి "అమ్మో! దైవం చేసిన దానిని మనుషులు కాదంటే అపచారంగదా!" యని అమాయకుల నోరునొక్కి, చెవుల్లో సీసం పోసి, బానిసత్వం నూరిపోసి, దైవం పేరుతో, జ్ఞానం నెపంతో స్వార్థాన్ని, ఆధిక్యాన్ని నిలబెట్టుకోవటం తేలికైంది.

ఒకరు చేసేపనిలోనికి, వారి సంతానము తప్ప మరొకరు ప్రవేశించ కూడదని, తద్వారావారి వర్ణమును, లేక కులమును, మార్చుకొనగూడదని, నీచమైన పనియైన, సొంతపని పాప భూయిష్టముకాదని పరుల ధర్మము చేపట్టిన భయం. భీతాహం కలుగజేయునని బెదరగొట్టిరి.

మనం నిజంగానో, హేతుబద్ధంగానో, సహజంగానో, సామాజికం గానో, భావించే రీతిగా కులాలు, పోవాలన్నా కులాలద్వారా యేర్పడ్డ అస్పృశ్యత పోవాలన్నా, మనం నమ్మే శాస్త్రాలను కూడ మార్పు జేసికొనుట చాల అవసరము. ఇది పెద్ద విప్లవమేమీ కాదు, భయపడుటకు, కొద్ది సంస్కరణ మాత్రమే! ఇది ఎంతయు యోచించవలసిన విషయం.



# సాంఘిక సమయోగి శ్రీ అసంగానంద గిరి

మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారి తురీయాశ్రమ దీక్షా నామము శ్రీ అసంగానందగిరి. ఆది నుండి ఆంధ్రదేశమున సుప్రసిద్ధమైనట్టి ప్రీతిపూర్వకరముగ గుర్తించ వీలైనట్టి వ్యవహారనామము శ్రీ మలయాళ స్వాముల వారనునది. నిరంతరము సర్వ ప్రాపంచిక విషయములందు సంపూర్ణ వైరాగ్యభావము గలిగిన శ్రీ స్వాములవారు సాంఘిక సమత్వముతో కూడిన యోగపురుషులైనారు.

యోగమనగా కలయిక, కవచము, యత్నము, యుక్తి, అదృష్టస్థితి అర్హత, భక్తి, భావము, మందు, మంత్రము అని అర్థము. జీవేశ్వరుల కలయికకు కృషి చేయడమని ఇక్కడ తాత్పర్యం భగవద్భక్తి కలిగి, నిత్యానుష్ఠానంతో ప్రాణాయామాది ప్రక్రియల నవలంబించి ధ్యాన సమాధు లందు లయమగుట యోగమని భావం. పతంజలి మహర్షి సిద్ధాంత ప్రకారం చిత్తవృత్తి నిరోధమే యోగం. భగవద్గీత 'యోగః కర్మసు కౌశల' మని నేర్పరితనంలో పనిచేయుట యోగమన్నది. సర్వావస్థలయందు తనను గూర్చి చింతించువాని యోగక్షేమ'ములను తానే వహించుచున్నట్లు గీతాచార్యుడు చెప్పియున్నాడు. మఱియు 'సర్వసంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే' అనియు గీతయందు గలదు.

ఏమైనను యోగిపుంగవుడుగ శ్రీమలయాళస్వాములవారు గుర్తింపబడి కీర్తింపబడి పేరు ప్రఖ్యాతులు పొందారు. భక్తిభావము కలిగి, యోగ ప్రక్రియల నవలంబించి, అధ్యయనమును శీలించి, మంత్రదీక్షనొంది, ఆశ్రమ ధర్మ మవలంబించి తదుచితరీతిగా ఆధ్యాత్మికజీవనము గడుపుటకు అందరూ

అర్హులేయని శ్రీ మలయాళస్వాములవారు ఆంధ్రదేశమున ఎలుగెత్తిచాటారు. కొందరు పూర్వీకులు ఆధ్యాత్మిక జీవితమని అది భౌతిక జీవితమని జీవితాన్ని విభజించి వ్యవహరించుటేగాక, సాంఘికంగా ఏర్పడిన విభేదములను స్త్రీ పురుష వ్యత్యాసాన్ని కూడ శాస్త్రబద్ధంచేసి, పరస్పర విభేదమును, వ్యతిరిక్త విధి నిషేధములను, అర్హతా నర్హతలను సృష్టించి ఇది దైవాజ్ఞయని శ్రుతి స్మృతి సమ్మతమని మనుజులను నిలువుగ, అడ్డముగ విభజించారు. సాంఘిక సమస్యలలో ఆధ్యాత్మికతను జొప్పించి, నమ్మించి అస్తవ్యస్తము జేశారు. యజ్ఞోపవీతం, గాయత్రి మంత్రం, సంస్కృతాధ్యయనం. వేదపఠనం అగ్ర వర్ణములవారికే అంకితమైనర్చారు. శూద్రుల కిందు ఏమాత్రము చోటు లేదు. శూద్రులకు ఆత్మవిద్య అనర్హమని నిషేధించారు. సంస్కృత విద్యావిషయం లోను, బ్రహ్మజ్ఞానార్జన విషయంలోను శూద్రులు ఉన్నతులు, సంస్కార వంతులు అగుటకు ఎట్టి అవకాశాలు లేవు. 'ఎంత ఆకలి చెందినా' ఎంత దప్పికొన్నను బ్రాహ్మణుడు శూద్రునిచేతి యన్నమునుగాని పానీయమును గాని స్వీకరింపరా'దని దేవలమహర్షి అజ్ఞాపన–'అతీవ తృషితో విప్రశ్చ శూద్రసోనదకం పిబేత్' అని.

స్త్రీల విషయంగూడా పై విధముగానే ఉన్నది. అంతేగాదు; స్త్రీలు పుట్టుకతోనే పాపయోనులని, పాపనివారణ జేసేటువంటి వేదోచ్చారణ వారి నోట పడరాదని, అట్లు పడినచో పా ప మ ని మన్వాదులు స్మృతులలో ఉటంకించారు. తద్విధముగా గాయత్రీమంత్ర జపమునకుగాని, యజ్ఞోపవీత ధారణకుగాని వారికి అర్హతలేదు. సంస్కృతాధ్యయనం, బ్రహ్మవిద్యమాట అసలేలేదు. పురుషులలో అగ్రవర్ణములవారికి అన్ని అర్హతలు ఉన్నప్పటికీ స్త్రీలలో అగ్రవర్ణముల వారికికూడ వేదాధ్యయనాదులందు ఎట్టి అర్హతలు

లేవు. ఈ విధినిషేధాల నుల్లంఘించి స్వతంత్రించి పాటుపడినచో వారికి వలసినన్ని శిక్షస్మృతు లేర్పాటు చేశారు. నూటికి నూరుమంది స్త్రీలు, నూటికి డెబ్బైమంది పురుషులు మొత్తం మీద జనాభాలో 3/4 వంతుపైగా ఉన్నారు. ఆధ్యాత్మిక విద్యాసంస్కారములకు అర్హులుగాకుండా పోయారు. ఇవి స్మృతులకాలములో నున్న పరిస్థితులు.

మనుస్మృతి 9వ అ. 18వ శ్లోకంలో: స్త్రీలకు వేదాధ్యయనార్హత లేదు. అందుకే వాళ్ళ సంస్కారములు వేదమంత్రములు లేకుండ జరుగును. వేదము చదువ కూడదు గనుక మతపరమైన జ్ఞానం స్త్రీలకు లేదు. పాప నివారణజేయు వేదపఠనార్హత స్త్రీలకు లేదు. గనుక వారు అసనతపరులు (పాపాత్ములు). II-213 పురుషుని వశీకరణజేయుచే స్త్రీ జన్మ. II-215 స్త్రీతో ఒంటరిగా కూర్చోరాదు IX-17. అపవిత్రత, దుష్ప్రవర్తన వారి సొత్తు IX-2 పురుషుని అధీనంలోనే స్త్రీ యుండవలెను IX-416. సతికి సుతునకు, దాసినకు ఆస్తి హక్కులేదు. VIII-209 భార్యను చీల్చిన వెదురుతో కొట్టవలెను XI-67: మద్యంత్రాగుట, స్త్రీ శూద్ర వైశ్యక్షత్రియ నాస్తికులను జంపుట ఉపపాతకములు మాత్రమే II-16. శూద్రులు స్మృతి చదువరాదు.

పరాశరస్మృతి :

'దుశ్శీలోపి ద్విజఃపూజ్యో నతుశూద్రో జితేంద్రియః' పై పరిస్థితులు తరతరాలుగా ఆచారంగా అనుచానంగా అడ్డంకి లేకుండా అందరికీ ఆత్మ గౌరవంగా నున్నట్లుగా సాగుతూ వచ్చినవి. ఇది దేశమునకు, సమాజమునకు హానికరమనిగాని, సమగ్రాభివృద్ధికి ఆటంకమనిగాని, బానిస తనానికి పునాది, పట్టు అనిగాని మానవ శక్తి సామర్ధ్యములు నిర్వీర్యమై పోవుచున్నవనిగాని, ఊహించుటకుగూడ వీలు లేనంతగా ఈ దుస్సంప్రదాయము బలీయముగా వ్రేళ్ళూనినది.

ఆధ్యాత్మిక విద్యగాని, యోగవిద్యగాని, పొందవలసినది, నేర్చుకోవలసినది సామాజికులైన మనుజులే గాబట్టి, సామాజిక విధినిషేధాలు మనుజుల ఆధ్యాత్మిక ఔన్నత్యానికి అడ్డు వచ్చినవి అందువలన సమాజము వేరు – బ్రహ్మసాయుజ్యసాధన వేరు అనుటకు వీలులేకుండాపోయినది కనుక బ్రహ్మజ్ఞానము మనుజులందరు సంపాదించ వలెనంటే సాంఘిక భేదములను, నిషేధములను తొలగించుటో, ఉల్లంఘించుటో తప్పనిసరియైనది. ఈపని బుద్ధుడు, రామానుజుడు, రాజారామమోహనరాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు కొంతవరకు జేశారు. సమాజము నందు వర్ణవిభేదములు తగవని, స్త్రీ పురుషులకు సమానార్హత లుండవలయునని కొంతవరకు పాటుపడ్డారు.

కేరళరాష్ట్రమున శ్రీ నారాయణగురువను మహనీయుడు ఆరాధనకు, ఆధ్యాత్మికమునకు అందరూ అర్హులేనని సంస్కరణబీజాలు వెదజల్లారు. ఇవి ప్రజల హృదయాలలో లోతుగా నాటుకొని సమాజములో గొప్ప మార్పు దెచ్చెను. ముఖ్యముగా కేరళలో 70 శాతం జనాభాగల యెజువ (పూర్వము వీరు అస్పృశ్యులు) కమ్యూనిటీ వారిలో అద్భుతమైన ఉభ్యుదయం వచ్చింది. వారిపుడు స్పృశ్యులేగాకుండ, సమాజమున అన్ని రంగములలోను అందె వేసిన వారైరి మరి ఆధ్యాత్మిక రంగమున గూడ వారగ్రగణ్యులైనారు. ఒకే మతం. ఒకే జాతి, ఒకే దైవం అను ఆదర్శం శ్రీ నారాయణగురుదేవు డనుసరించెను. అట్టి ఆదర్శములనే మదిలో నిడుకొని మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారు ఆధ్యాత్మపరంగా ఆంధ్రసమాజమున సమతత్వయోగ మవలంబించి బహుళ ప్రచారము గావించారు.

1885లో కేరళలో వేలప్పన్ అను పేరున జన్మించి, బ్రహ్మచర్య మవలంబించి, తిరుమలలో పన్నెండు వర్షములు కఠోరనియమములతో

ఉపన్యాసములద్వారా తపస్సుగావించి,జ్ఞానధనులైన వీరు(శ్రీమరాయాళస్వాములవారు) శ్రీకాళహస్తి సమీపమున ఏర్పేడుగ్రామప్రాంతమున'శ్రీవ్యాసాశ్రమం' అనుఆధ్యాత్మికసంస్థను 1926లోస్థాపించారు 1962వరకు గ్రంథరచనద్వారా, సనాతన జ్ఞానసభలు, చాతుర్మాస్యవ్రతములు నిర్వహించుట ద్వారా, అశ్రీమాల స్థాపనద్వారా, వివిధసంస్థలద్వారా తన ఆ ద ర్శా ల ను ప్రకటిస్తూ, పాటిస్తూ ఆంధ్రదేశమున గొప్ప ఆధ్యాత్మిక పరిణామమును కొనితెచ్చారు.

సంస్కృతాధ్యయనమునకుగాని, వేదాంతతత్వ విచారణకుగాని, మంత్రోపదేశమునకుగాని, ముక్తి నొందుటకుగాని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర పంచమ వివక్షత అవసరములేదని నొక్కి వక్కాణించుటేగాక తగిన శాస్త్రములద్వారా, అనుష్ఠానము ద్వారా నిరూపించారు. అంతేగాదు, ఈ విషయమున స్త్రీ పురుష నిషేధముకూడ వలదని సర్వులకు అర్హత కల్పించినారు.

బు ద్ధు ని పలుకులు అసంగానందునికి అనుసరణీయమైనవి గదా! బుద్ధుడు – 'ఓయీ అశ్వలాయనా! బ్రాహ్మణ స్త్రీ గూడ గర్భముదాల్చి, బిడ్డ నుగని, పాలిచ్చి పెంచుచున్నది గదా?.... (ఇతర వర్ణములందును. శిశు జన్మము ఈ పద్ధతిలోనే గదా...) ఇట్లుండగా బ్రాహ్మణులు బ్రహ్మ ముఖము నుండి పుట్టిరనుట ఆశ్చర్యముగదా! ప్రకృతి విరుద్ధముగాదా!' అనెను

శ్రీ స్వాములవారికి అందరూ సమానులే. సామాన్యుల నెంద రెంద రినో మాన్యులుగా నొనర్చినారు. ఎందరినో సన్యసింపజేశారు, పామరుల నెందరినో సంస్కృత పండితులుగా తయారుచేశారు. స్త్రీల నెందరినో బ్రహ్మజ్ఞాన సంపన్నులుగా తీర్చి దిద్దారు. సంస్కృత పా ఠ శా ల ను

ప్రతిష్ఠించారు. బ్రహ్మవిద్యా పాఠశాలను నడిపారు. స్త్రీ పురుషులకు సమానావకాశములను కల్పించారు; సమస్థాయిని జూపించారు. ' కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం, స్మృతిర్మేధా ధృతిః క్షమా' అని స్త్రీలను కీర్తించనట్టియు, 'మాంహి పార్థ వ్యపాశ్రిత్యయేపి స్యుః పాపయోనయః, స్త్రీయోవైశ్యా స్తథాశూద్రా స్తేపి యాన్తి పరాంగతిమ్'– అను గీతా శ్లోకములను తమ ధర్మ నిర్ణయానికి ఆధారంగా తీసుకున్నారు. ఆధ్యాత్మికసాధనలో సాంఘికమైన వర్ణవిభేదమునకు తావులేదన్నారు. యోగవిద్యాభ్యాసములో సాంఘిక సమత్వం జూపించారు. మనిషి ఒకడే; వాడు సంఘజీవిగానున్నను, యోగిగా నున్నను వానిది సమగ్రజీవితము మాత్రమే. అట్టి సమగ్రజీవితమునకు కుల వ్యత్యాసములు పాటించుట తగదని తెలియజెప్పారు మౌనముగా, మెత్తగా, మైత్రిగా కుల గర్వితుల చాప క్రిందకు నీరు పారించి, తట్టినట్లుగా తటాలున లేపి ఈ వర్ణవివక్షతలు విధినిషేధము లెట్లు అసమంజసమైనవో, ఎంత హానికరమైనవో పునర్విచారణ జేసి కొమ్మని హెచ్చరించారు. తాను మాత్రము నిర్విరోధముగా, నిశ్చలధ్యానంతో, నిర్వికారంగా, వైరాగ్యముగా నుంటూ వివాద విషయములలో మాత్రమేగాక ప్రాపంచిక విషయములలో తటస్థబుద్ధితోను, అసంగచిత్తముతోను జీవించారు. జీవితాంతము విరాగిగా నుంటూ, తురీయాశ్రమ నామమైన 'అసంగానందగిరి' యను నామమును సార్ధకము జేసికొన్నారు.

ఈనాడు సర్వవర్ణములవారు, స్త్రీ పురుషులు ఒకచోటజేరి ఆంధ్ర దేశమున నేమూలనైనా సామూహిక గీతాపారాయణ మంత్ర జప ధ్యానాదులు జేయుచున్నారంటే, అది శ్రీ స్వాములవారి శిక్షణయే యని చాటి చెప్ప వచ్చు. సాధుసంత్ సన్న్యాసులకు ఇచట కొంత ఆదరణ లభించు చున్నదంటే అది శ్రీవారి అనుష్ఠానముయొక్క, ప్రచారము యొక్క ఫలితం. అన్ని వర్గములవారు. వర్ణములవారు చాతుర్మాస్య వ్రతములలోను ఆరాధనా

సమయములలోను, సభా సంచార కార్యక్రమములలోను సామూహికంగా కలిసి మెలసి జీవిస్తున్నారంటే అది శ్రీవారు తెచ్చిన సామాజిక ఆధ్యాత్మిక మార్పు. సహపంక్తి భోజనాలు సమారాధనలు అందరూ కలిసి కొనసాగిస్తున్నారంటే దానికి శ్రీవారు దైవపరంగా వేసిన పునాది సత్రాలే కారణమనదగును. శ్రీవారీవిధంగా సాంఘికముగను, ఆధ్యాత్మికముగను సమ దర్శనమునకు సమవర్తనమునకు నిత్యజీవితము ద్వారా ఇను మిక్కిలి దోహదమొనర్చి, ఒక సంప్రదాయమును నూతనముగా సృష్టించి, వ్యాసపీఠము నందుకు తగినట్లుగా స్థిరపరచి, పరంపరగా కొనసాగునట్లుచేసి సాంఘిక సమయోగిగ గణుతికెక్కిరి.

'విద్యా వినయ సంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ
పణ్డితా స్సమదర్శినః'

సర్వులయెడ సమదర్శనం కలిగివుండటం యను పండిత లక్షణము శ్రీవారికి శిరోధార్యము,

1885లో అవిర్భవించిన శ్రీ మలయాళ (అనంగా నందగిరి)స్వాముల వారికి 1985తో శతవర్షములు నిండును, శత జయంతి స్మృతిచిహ్నంగా శ్రీవారుసంఘపరంగా ఆధ్యాత్మికవిద్యలో తెచ్చిన సంస్కరణాత్మకమైన మార్పులకు, ప్రగతికి ఇది రేఖామాత్ర రచన.

ఇది 'శ్రీ రఘు' యర్పించు శ్రీవారి శత జయంతి తొలి నీరాజనము.

24

# పరిశుభ్రత - పవిత్రత

"మల నిర్మోచనం పుంసాం జలస్నానం దినేదినే
సకృద్గీతాం భసి స్నానం సంసారమల మోచనం"

దిన దినము స్నానమాచరించుటచే శారీరక పరిశుభ్రత ఏర్పడును. అట్లే నిత్యము గీత చదువుటవల్ల మానసిక శుద్ధి ఏర్పడును. మామూలు జల స్నానముచే దేహమాలిన్యము పోవును. గీత అను జలస్నానము చేస్తే సంసార మాలిన్యము పోవును. శరీరమున్నంతవరకు మలినం పుట్టక తప్పదు. సంసారమున్నంతవరకు మాలిన్యం వ్యాపిస్తూనే ఉంటుంది. మాలిన్యం మంచిదికాదు, అది విషేధవస్తువు అనిపిస్తే అటు శరీరము అక్కరలేదు, ఇటు సంసారమక్కరలేదు. అయితే శరీరం కావాలి, సంసారం కూడా కావాలి, మాలిన్యం మాత్రం అవసరం లేదు, ఇది ఎట్లా సాధ్యం? రోజూ స్నానంచేస్తూ, తగిన ఆహారాది నియమములు పాటిస్తే శరీరమూ ఉంటుంది, ఆరోగ్యమూ ఉంటుంది. మలినాలు మటుమాయమౌతాయి. నిత్యం శాస్త్రాధ్యయనం చేస్తూ, నైతికధర్మ సూత్రాలను పాటిస్తూ, సామాజిక బాధ్యతతో వర్తిస్తే సంసారమూ ఉంటుంది. సుఖమూ ఉంటుంది. దుష్ట బంధనములు తగులకుండా, తగిలినా విచ్ఛిన్నమైపోతూ, ఉంటాయి.

ఇక్కడ సంసారమనగా భార్యా బిడ్డలతో కూడిన గృహస్థాశ్రమమని అనుకోటానికి లేదు. శరీర జంజాటనము, లోక వ్యవహారములు, మమకారములు, సంసారమనవచ్చును. మనసుకు సంబంధించిన కల్మషం, నానా చిక్కులు, పాపిష్ఠ భావం, అజ్ఞానాంధకారం, చెడు నడవడి మొదలగు మాలిన్యపు వ్యవహారములను సంసారమలమని అనవచ్చును. అందుచే ముఖ్యముగా సంసారమనగా మనసునకు సంబంధించిన విషయము. సంసార మలమనగా అశుద్ధమనసుకు సంబంధించిన వ్యవహారము. మనసుకు సంబంధించిన అపరిశుద్ధత తొలగిపోయిన స్థితినే పవిత్రత అనవచ్చును. సంసారమల మోచన మనగా పవిత్రత కలిగియుండుటయని భావము.

పవిత్రత మనసుకు సంబంధించినది. పరిశుభ్రత శరీరమునకు సంబంధించినది. స్నానం చేసినపుడు కూడ పవిత్రంగ, ప్రసన్నంగా ఉన్నట్లు అంటారు. జ్ఞానం కలిగినపుడు, చక్కని వర్తనం కలిగినపుడు, సాత్విక గుణములతో కూడినపుడు పవిత్రంగ ఉన్నారని అంటారు. స్నాన, శౌచ విధులవల్ల పవిత్రత ఏర్పడునందురు. మరియు గంగ, గోదావరి, కృష్ణాది నదీజల తీర్థములలో మునుగుట వలన కూడ పవిత్రత మరొక పేరున పుణ్యము లభించునని యందురు. మనస్సును శుద్ధి చేసికొనుటవలన పవిత్రత ఏర్పడునను విషయము బాగుగా అర్థము చేసికొనవచ్చును. శరీరాన్ని కూడ శుద్ధం చేసికొనినపుడు పవిత్రత ఎట్లేర్పడునవనే విషయం గ్రహించుట కొంత క్లిష్టముగ నుండును. జలస్నానము వలన మల విమోచన మేగాక, మనసు కూడ శుద్ధమగును అని చెప్పవలసి వచ్చినచో పవిత్రతకు, పరిశుద్ధతకు మధ్య ఏదైనా వ్యత్యస్తమున్నచో అది చాల వరకు సన్నగిల్లి పోవును. పరిశుద్ధతయే పవిత్రతయగును. అది శారీరకము కావచ్చు.

మానసికము కావచ్చు. మరియు శారీరక పవిత్రత మనసు మీద కూడ పడ వచ్చును. శరీరమునకు సంబంధించిన విషయం మనసుపై ప్రభావం చూపుట, మనసుకు సంబంధించిన విషయం శరీరంపై ప్రభావం చూపుట సహజ ప్రక్రియ కావచ్చును. అట్లగుచో శరీరమునకు, మనసునకు మధ్యగల భేదము చాలా తక్కువయని కూడ అంచనా వేయవచ్చును.

ఈ సందర్భములో గాంధీ మహోదయుడన్న మాట తూచినట్లు సరిపోవును. "Cleanliness is next togodliness" అని అన్నాడు. "పరిశుభ్రత అనునది దైవత్వమునకు సమీపముననే గలదు. అనగా పవిత్రతకు సంబంధించినదే పరిశుభ్రత, రెంటికిగల తేడా చాలా కొద్ది మాత్రమే. మనో వాక్కాయముల ద్వారా పరిశుభ్రత గలవాడు పవిత్రుడు కాగలడు. మన శ్శరీరముల వ్యత్యాసమును గూర్చి యోచింతము. శరీరము అనగనే జడ ప్రకృతి యందురు. బాహ్య శరీరమునకు లోపల రక్తమాంసములు గలవు. ఇంకను లోపల ప్రేగులు, ఎముకలు, రక్తనాళములు, ధమనులు, నాడులు, కణములు, జీనులు, ఎన్నో సూక్ష్మ పదార్థములు కలవు. ఇందులో కంటికి కనిపించని పదార్థములు కూడ ఎన్నియో కలవు. అదే విధముగా బుద్ధి, హృదయము, మనస్సు కలవు. ఈ మూటికి ప్రయోగములలో భేదములు తప్ప. సూక్ష్మ పదార్ధములో లేక సూక్ష్మ విషయములో అంతయు ఒకటే. దానిని సర్వసాధారణ శబ్దముగా మనస్సు లేక చిత్తము అని వ్యవహరింతము మనస్సును విడిచి శరీరము లేదు; శరీరమును వీడి మనస్సులేదు. శరీరమునకు సంబంధించినదే మనస్సు. శరీరము జడమని గౌణముగా చూచుటగాని, మనస్సు చైతన్యమని గౌరవముగా చూచుటగాని తగదు. మన శ్శరీరములు

పరస్పర పూరకములు, పరస్పర ప్రభావితములు ఈ విధమైన సమాదరణ కలిగినపుడే వాని ప్రయోజనములు కూడ సమానుభవమునకు రాగలవు.

కనుక శరీరము యొక్క ప్రభావము మనసు మీదను, మనసు యొక్క ప్రభావము శరీరము మీదను పడుచుండును. గంగా స్నానమువలన శరీరము పరిశుభ్రమైనచో మనస్సు కూడ పవిత్రత చెందగలదు. శారీరక శుభ్రత మనోపరిశుద్ధతకు దోహదమగును శారీరక పారిశుధ్యమునకు కూడ దారితీయగలదు. శరీరమునకు, మనస్సునకు, అట్లే పరిశుభ్రతకు, పవిత్రతకు ఒక విధంగా వ్యత్యాసము ఎక్కువగా నున్నట్లు గోచరించినా పై విధంగా విశ్లేషణ జేసినచో వ్యత్యాసము అల్పమైనదని కూడ అవగాహన యగును. గంగా జలస్నానము వలన పవిత్రత, పుణ్యత లభించుననుటలో అర్థమెంత మాత్రము సమంజసము కాగలదు? భావనా ప్రభావము కూడ నిరాధారము, అపరిమితము కాదు గదా! ఒక ఖనిజములో బంగారమున్నదనినచో అది ఎంత మేరకు, ఎంత శాతము ఉన్నది అనుదానిపై దాని విలువ ఆధారపడి యుండును. అదే విధంగా ఒక పరిశుభ్ర పరిశుద్ధ, పుణ్యారోపిత కార్యము యొక్క విలువ దానివల్ల లభించే ఫలితము యొక్క పరిమితిపై యాధారపడి యుండును. కనుక అర్థాల యొక్క, భావాలయొక్క, ఫలితాల యొక్క, మాహాత్మ్యల యొక్క ప్రభావము పరిమితములేగాని అపరిమితములు, ఊహా మాత్రములు, అవాఙ్మానసములు కాకూడదు నిత్యానుభవములైనవాటికే నిజమైన విలువ, ఉత్ప్రేక్షలకు, అతిశయోక్తులకు, కవితా స్తోత్రాలకు అక్షరాలా గురియైనచో అవాస్తవికతలోను, భ్రాంతిలోను, ప్రమాదంలోను పడిపోవలసి వచ్చును.

మొదట్లో ఉదహరించిన శ్లోకము యొక్క సారాంశము జలస్నానము వల్ల దేహశుభ్రత మాత్రము లభించును. గీతాధ్యయనము వలన మనోశుభ్రత ఏర్పడును. ఇది చాలా స్పష్టము. ఇంతవరకే పరిమితము. అయితే నదీ స్నానము పవిత్రము, పుణ్యము అని చెప్పినచో, దాని వలన మొదట శరీర శౌచమేర్పడి,తద్వారా మనోనైర్మల్యము కూడ కొంతవరకు ఏర్పడ వచ్చునని భావార్థము. పరిమితమైన భావనా ఫలితమని గ్రహించనగును. ఈ పరిమితికి మించిన పవిత్రత పుణ్యము. స్వర్గము, దైవత్వము, ప్రత్యేకత, మరేదో తెలియకుండా లభించునను భ్రమలో మాత్రం పడరాదు.

# నిమ్నజాతుల నివాళి

చెప్పేది అద్వైతము చేసేది అస్పృశ్యత—ఇది వికటించిన హైందవ వేదాంతము. భారతీయ మనోధోరణి మహామహులు కూడ నంతే రాక్షసులు శాస్త్రములు నుదహరించినట్లు మన వాదమునకు ఆధారముగ వేదోప నిషత్తులను టంకించుము. శాస్త్రమెట్లున్నా వాస్తవంలో చూపేది ద్వైతము; దానికి మూలం స్వార్థము మూఢ విశ్వాశము. ఏకాత్మభావనలో కనిపించే లోపాయికారి తనం.

జగద్గురువులయిన శ్రీ శంకరాచార్యులకు వయితము స్వాత్మ జ్ఞానోదయం చాల కాలమునకు గాని సంభవంకాలేద. ఎట్లనిన "అయ్యా! నా శరీరం అన్నమయం, నీశరీరం అన్నమయం నీలోని చైతన్యము,నాలోని చైతన్యము ఒక్కటే. ఇంకాదేన్ని తొలగమంటావు?" అని కాశీలో ఎదురు పడిన ఛండాల వేషధారి ఎదురు తిరిగి ప్రశ్నించినపుడు, ద్వైత దృష్టి

వాహితుడన బరిగిన శంకరుని బుఱ్ఱగిఱ్ఱున తిరిగింది. తత్క్షణమే జ్ఞానోదయ మయ్యింది. జాతిభేద రహిత అనుభవైక అద్వైతియైనారు. వెంటనే ఛండాలోస్తు సతుద్విజోస్తు గురి రిత్యేషా మనీషామను''యని స్తోత్రించి, కీర్తించినారు.

అయితే యుక్తాయుక్త ధర్మపరులైన శ్రీ మలయాళస్వాములవారు మాత్రం ఆదినుండే పై విధమైన ద్వంద్వ వైఖరి నవలంబించక. ''ఆత్మౌపమ్యేన సర్వత్ర''యను భావనను జీవిత ధ్యానమున నిస్సంశయముగ నిలిపిరి. నిరంతర సాధన జేసిరి. జయశీలురైరి.

సద్గురువని మహర్షి సద్గురు శ్రీ మలయాళస్వాములవారని ప్రసిద్ధికెక్కి- భక్తి సప్రపత్తులతో సంబోధింపబడిరి. తన కుల మేమిటో చెప్పుకొనే యవసరముగాని, ఇతరులడిగే యవకాశముగాని ఇతరులనడిగే యపేక్షగాని ఎన్నడు రానీయని పరిపూర్ణ జాతిభేద విదూరుడు. ఇది వారి విశేషము, ప్రత్యేకత. శ్రీవారి గురువు శ్రీ శివలింగాచార్యులు. గురోద్గురువు శ్రీ నారాయణ గురుదేవులు గతించిన కాలంలో అస్పృశ్యతకు గురియై క్రమేపి-ప్రస్తుతం-వెనుకబడిన జాతిగా గుర్తింపబడిన. 'ఎజువా' (తియ్యా) కులమునకు చెందినవారు. శ్రీ నారాయణగురు ఒకే కులం ఒకే మతం ఒకదైవం'' అను ధ్యేయంతో సాంఘిక సమానత లమిత్తము జాతి భేదము నెదుర్కొని నిర్మొహ విశ్వాసములతో నాధ్యాత్మిక మార్గమున నిరంతర సేవ జేసి కేరళమున తనవారికి తక్కిన బడుగు వర్గాలవారికి మహోన్నత మనుగడను గౌరవమును, స్థాయిని, సమకూర్చిన సమగ్ర గురుదేవుడాయన. శ్రీవారి

కాలమునకు ముందు నుండి నారాయణ గురుధర్మ పాలనా సంఘం రాష్ట్ర మంతట సుసంఘంటిత శక్తిగా ఉద్యమించి పనిచేయుచున్నది.

శ్రీ రాజగోపాలాచారి, తిరువాన్కూరు, సంస్థాన దివానుగా నుండగా ఒకనాడు శ్రీ నారాయణగురు దర్శనార్థము వెళ్ళి "కులము సహజాత మైనది. మనిషి ముఖం జూచి కులము చెప్పవచ్చును." అనెను. హిందు ముస్లిం పరియాలు/క్రైస్తవ భౌద్ధులేగాక బ్రాహ్మణులు, పరియాలు గూడ తన యాశ్రమములో నుండిరి. అందరిని వరుసగా నిలబెట్టి కొన్ని మంత్రములు పఠింపజేసి వారిని గుర్తించమనిరి. రాజగోపాలాచారి తప్పులు తడక సమాధానాలు చెప్పి విఫలుడయ్యెను. కులము కల్పితమైనది. కూడనిది. కోరనిది. అని ముందుగా తేల్చుకొని ముందుకుసాగిరి. నారాయణగురు.

'నిమ్న జాత్యుద్ధారకా। నిందిత మానవరక్షకా।
నాయ్య మార్గ ప్రకాశకా। జ్ఞాన విజ్ఞాన పోషకా।

యని నివాళింపబడిన డా॥ అంబేద్కరునకు శ్రీవారు సమకాలికులు అటు "ఒకేదేశం, ఒకే ప్రజ" సిద్ధాంతమున జాత్యుద్ధరణ సేవలో తలమునకలుగా శ్రమపడుచున్న అంబేద్కర్ రాజకీయ సాంఘిక సమరమున గమనించుచు, యిటుతాను ఆధ్యాత్మిక సాంఘిక సేవలో నిమగ్నులై యుండిరి.

స్వారాజ్యము ప్రతి వ్యక్తి జన్మహక్కు అన్నారు శ్రీ వారు. స్వారాజ్యమనగా ఆత్మరాజ్యం ఆధ్యాత్మిక రంగం. ఆత్మాభి వృద్ధికి కుల విచక్షణ కూడదు గదా. లింగ వివక్షత గూడ తగదనిరి. అట్లే సాంఘిక జీవనమున కూడ కులవ్యత్యాసము కూల్చి వేయవలెననిరి. అంతేగాక జాతి

భేదముచే కొందరికి గలుగు దురవస్థను తలచుకొని కన్నీరు గార్చెడివారు. "ఈజాతి భేదమెప్పుడు కలిగినది? దేని కొరకు పుట్టినది? ఎవరిచే నేర్పరుప బడినది?" అని తీవ్రముగా ప్రశ్నించిరి. ఈశ్వర సృష్టిలో జాతి భేదము లేదని నిశ్చయము జేసికొన్నారు. 1914వ సంవత్సరము నుండి జాత్యహంకార పైశాచిక ప్రవృత్తిని భక్తుల నుండి పారద్రోల ప్రగాఢ ప్రయత్నములో నుండిరి.

భారత దేశమున నూటికి 55 గురు స్త్రీ లున్నారు. మిగిలిన 45 మందిలో నూటికి 60 మంది అనగా 45 మందిలో 25 మందికి తగ్గకుండా శూద్రాదులున్నారు. మొత్తము మీద నూటికి 55 + 25 వెరసి 80 మంది మనుశాస్త్ర రీత్యా ఆధ్యాత్మిక విద్యాగంధమునకు నోచుకోని వారున్నారు. జనం జనం మధ్యభేదం, ఆడ మగ మధ్య అఘాతం, మనుషులలో హెచ్చు తగ్గులు అధిక సంఖ్యాకులకు అనర్హత యుండుటవలన భారతీయసంస్కృతిలో అనైక్యత, అక్రమం, అలము కొన్నవి. అన్యాయం ఈ దురవస్థను ఆచరణాత్మకంగా, స్వానుభవ పూర్వకముగ నెదుర్కొనుటకు శ్రీవారు స్త్రీలను శూద్రాదులను నొక్కచో జేర్చి వారికి గీతాపారాయణము, సంస్కృతాధ్యయనము, వేదోక్త మంత్రోచ్చారణము, సంన్యాస స్వీకారము చేయించినారు. ఇవి ఆంధ్ర, ఆంధ్రేతర ప్రదేశములలో బహుళ వ్యాప్తమై యుండుట సూర్యరశ్మి తుల్య సత్యము గదా!

ఇకపోతే మిక్కిలి వెనుకబడిన బడుగు వర్గాలలో నిమ్నజాతుల వారిది బహు శోచనీయమగు అధమాధమ స్థితి. వారు కట్ట కడపటి నిచ్చెన మెట్టు అట్టడుగున అణగద్రొక్కబడినవారు. అణగి మణగి యున్నవారు.

వారికి అంటరానితనము నంటగట్టుట సీతాతినీచ మనుటకు బదులు కిరాతకము నకు కిరీటము కట్టిపెట్టినట్లయినది అస్పృశ్యత హిందూ సమాజమునకు కుష్టువ్యాధి వంటిది. దానివల్ల సంఘమున ప్రత్యేకమైన కుళ్ళుకంపు పుట్టినది. వర్ణభేదముచే పరువు, మర్యాద, అర్హత, ఆర్థికం కోల్పోయి ఊరికి దూరంగా వెలివేయబడిన పీడిత, తాడిత, బాధిత, దళిత, నిరుద్ధ, హీన, దీన హీన మానవులే నిమ్నజాతులవారు. గాంధీచే హరిజనులనబడిన షెడ్యూల్డు కులాల వారు, అట్టివారిని సైతము ఆదరింప బూను కొన్నారు. శ్రీ స్వాములవారు.

"దుశ్శీలోపి ద్విజః పూజ్యోనచ శూద్రోజితేంద్రియః" అని (పరాశర స్మృతి) యన్నపుడు శ్రీవారి హృదయమున దుఃఖాగ్ని ప్రజ్వరిల్లినది. తేజో బిందూపనిషత్తు చెప్పినట్లు చర్మమువల్ల, రక్తమువల్ల, మాంసమువల్ల జాతి కాదు, అది వ్యవహార కల్పితము మాత్రమే–" నజాతిరాత్మనో జాతిర్వ్య వహారః ప్రకల్పితః" శ్రీవారు జాతి నిర్ణయమునకు బీజాంకుర న్యాయ మంగీకరించరు. అయితే "సర్వయోనిషు.... బీజ ప్రదఃపితా"–యని విశ్వసించిరి. గుణకర్మ విభాగశః అను దానిని సహేతుక దృష్టితో స్వీక రించిరి. అందుకే కులభేదము లేదు నీకు గుణభేదమేగాని' అని కీర్తించు కుంటున్నాము. శ్రుతి చెప్పినట్లు "సర్వసాక్షిణ మాత్మానల వర్ణాశ్రమ వివర్జితం: బ్రహ్మరూప తీయాపశ్యన్ బ్రహ్మైవ భవతి స్వయం."– ఇది శ్రీవారి నిజజీవన రూపం. ఇంకా దత్తాత్రేయోపనిషత్తు ప్రకారం ఆత్మ దర్శనము వలన వారు అతి వర్ణాశ్రమి యైనారన వచ్చును. మరియు వరాహో పనిషత్తునందువలె పశ్వాది స్థావరములలో పిపీలకాది బ్రహ్మ పర్యంతము సమముగా నుండగల్గిన స్థిరజ్ఞాని.

"మంగళ్యం బ్రాహ్మణస్య స్యాత్ క్షత్రియస్య బలాన్వితం వైశ్యస్య ధన సంయుక్తం శూద్రస్యతు జుగుప్సితమ్—అని శూద్రుల నామము గూడ జుగుప్స కరంగా ఉండాలని మనువు శాసించెనని వారి దృష్టికి వచ్చినపుడు" పేర్లలో గూడ నింత అవమానకరముగా విధించువాడు సమబుద్ధియు, యోగ క్షేమములు గూర్చు వాడెట్లగును?.... శూద్రులని త ల ం చు వా రు (ఇది) సహింతురా? ... బ్రాహ్మణులింత నీచ కార్యము చేయవచ్చునా?" అని ఆవేదన వెలిబుచ్చిరి. తన ప్రేమా ధీనమునకు వచ్చిన బిడ్డలకు నారాయణ చరణము. బాదరాయణ వేదవతి మున్నగు ముచ్చటైన పునర్నామములు బెట్టెడివారు. "క్రింది జాతిలో నున్నవారు పై పై జాతులలోనికి వెళ్ళుటకు తగిన విద్యాజ్ఞానము, సంస్కారాదులకు గూడ అర్హతలేదని చెప్పుటకన్న అకటా! మరియొక ఘోరపాపము కలదాయని వాపోయిరి. "అంతజాతిర్ధిన జాతిశ్చ ఏక ఏవ సహోదరే" అని విశ్వసించిరి. గుణమే కళ్యాణ కారణం పవిత్ర వర్తనము గలవాడు ఛండాలుడైనను బ్రాహ్మణుడే! అను భారత ప్రబోధమును శిరోధార్యము జేసికొన్నారు. జనేభ్యః— జనులందరి కొరకు స్వాయచరణాయ—సేవకులకు, స్త్రీలకు, అతి శూద్రులకున్న వేదములను ప్రకాశపరచినట్లు యజుర్వేదమున చెప్పబడినది గదా!

సుదీర్ఘముగా నిశిత విమర్శజేసి శ్రీవారుకు శాగ్ర బుద్ధితో చివరికిట్లు శలవిచ్చిరి "నా యొక్క మనో విశ్వాసమును జెప్పెద. 1. అంత్య జాతి యందు జన్మించిన వారైనను భక్తిభావన సద్గుణ బ్రహ్మనిష్ఠులైనచో వారిని బ్రహ్మ ఋషి సత్తములని తలచెదను. 2. బ్రాహ్మణ జాతిలో జన్మించి నికృష్టాచార దుర్గుణ పూరిత జ్ఞానహీనులైనవారు ఛండాలురని నా నమ్మకము.

"ఈ యుపాధికి యీశ్వర కృపవల్ల మత వైషమ్యముగాని, జాతి ద్వేషముగాని, జన్మనా కలిగియుండలేరు. మరియు శ్రీ వ్యాసాశ్రమమునకు సంబంధించిన భక్తులలో చాతుర్వర్ణ స్త్రీ పురుషులేగాక, హరిజన పురుషులు స్త్రీలున్ను (గూడ కలిగి)యున్నారు.... అని శ్రీవారు 1945లో కోద్ధారకము' పీఠికలో వ్రాసికొనిరి.

స మ త్వ ము, సోహంభావము చవిచూపించదలంచి దళిత జాతి వారలలో శ్రద్ధా వంతులకాత్మ స్వారాజ్య సాధనమున స్థానము, చేయూత నొసగిరి. ఆధ్యాత్మిక రంగమున అర్హత నేర్పరచి ఆత్మోన్నత్యమును నిల బెట్టుకొనిరి. గోడనెక్కి బహిర్గతముగా హరేరామ మంత్రమును ప్రజ లందరికి పంచి పెట్టిన శ్రీరామానుజాచార్యులవలె. ఎల్లరను తన శిష్య వర్గమున జేర్చుకొని మంత్ర తంత్రి జప పూజహోమా సాధన చతుష్ట యాభ్యయన కార్యములలో తగు భాగస్వాములుగ జేసిరి నెల్లూరుజిల్లా ఇనమడుగువాస్త బ్ర॥ నరసమ్మ, అచ్చెమ్మ, యామాళమ్మగారలు, కోటంబేడువాసి వెంకట స్వామిగారు, వెంకటగిరి నివాసి చిన్నబ్బగారు, చెంబేడుకు చెందిన బ్ర॥ చంగయ్యగారు చిత్తూరుజిల్లా వెంకటయ్యగారు, పెదళ్ళచెరువు వాస్తవ్యులు చెరులోపల్లి మునియ్య, తాటియాకుల సుబ్బయ్య, నరసయ్య, బొందా రామ కృష్ణయ్యగారలు, ఆరూరు అరవపాలెం నుండి బలరామయ్యగారు మొదలగు వారు శ్రీవారికి సన్నిహిత శిష్యులైరి. లేని గౌరవము, వారితో శ్రీవారు చనువుగ, చెలిమిగ, సమముగ చిరునగవుగ, నెనరుగ, నిర్భేదముగ మెలగు చుండెడివారు. ప్రతిమాఘ పౌర్ణమినాడు నిమ్నజాతి భక్తులచే ప్రత్యేకంగ

'గురుపూజ' జరిపించు చుండెడివారు. వారిద్వారా శ్రీవారు స్వయంగ భిక్ష గైకొను చుండెడివారు

వర్ణాశ్రమ బద్ధ హిందూ మతాభిమానులు కొందరు మతాంతీకరణము విరోధించ శ్రీవారిని ప్రచారము చేయమని సూచించిరి నిమ్నజాతీయు లితర మతములతో చేరుట అది పుణ్యమనిగాని, మోక్షమనిగాని తలంచిగాదు. సవర్ణ హిందువులు, మానవుల కుండవలసిన హక్కులను వారికి నిషేందిచుట చేతను వారు మతాంతర ప్రవేశమునొనర్చు చున్నారు ... మీరు తమ ప్రబోధము చేయనక్కరలేదు. వారికిని మతము, విద్య, ఉద్యోగము మున్నగు వానిలో అవకాశము కలిగింపుడు అప్పుడే వారు పరుగిడి వచ్చి మీలో చేరుదురు. ఇదే ఇందలి రహస్యము." అని శ్రీవారు నుడివిరి. "శ్రేష్ఠ గుణములు గలవారిని గూడ వర్ణాశ్రమ ధర్మమును పేర వేరు పరచుట యెంతయో అధర్మము .. వర్ణాశ్రమములు సనాతములు కావు.... అని పెద్ద భగవద్గీత రచనా కాలములో శలవిచ్చిరి.

1959 ఫిబ్రవరి 10వ తేదిన అస్పృశ్యతా నివారణ ప్రచారకులు కొందరు వ్యాసాశ్రమము రాగా శ్రీవారిట్లు ద్బోధించిరి. "సోదరులారా? హరిజనులీ దేశమున ఆదిమ జాతులకు చెందిన వారనియు ఆర్యులీ దేశము నాక్రమించుకొని వారిని బానిసలుగా చేసినారనియు చరిత్ర కారులు కొందరు తెల్పిరి.... నిజమని తోచుచున్నది.... హరిజనుల నస్పృశ్యులుగా వెలి వేయ బడుటకు గోహింస కారణము కావచ్చును. కావున హరిజనులీ దోషమును తమలో లేకుండ జేసికొనవలెను. ఏమతములో నున్న వారలామతమును పాటింపవలయును. ఇటీవల అంబేద్కరు బౌద్ధ సంప్రదాయానుసారము సంస్కారము జేసికొని బౌద్ధ మతములో ప్రవేశించలేదా? సవర్ణ హిందు

వులను కులమును గొప్పగా నెంచక గుణమునకు ప్రాధాన్యత నీయవలయును నాయనలారా! శ్రమపడి విద్య నభ్యసింపుడు. మీ సంతానమును విద్యా వంతులుగాను సత్ప్రవర్తన గలవారలుగాను తీర్చి దిద్దుకొనుడు.... అప్పుడు మీరు కృతార్థులు కాగలరు."

నిమ్న జాతులకు సైతం నైష్కర్మ్య సిద్ధి నుద్బోధించిన
నిమ్నోన్నత కులస్థుల నొకే త్రాటిపై నడిపిన
నిరుపమాన సద్గురు సంగా నంద చంద్రవంద్యులకు
నిండు హృదయ నివాళి! నీరాజన సుమాళి!

# ఆధ్యాత్మికంలో సాంఘిక దృక్పథం

మానవ సమాజంలో మనిషి కేంద్రం, తాను నిర్మించిన సామాజిక పరిస్థితులను తన కనుకూలంగ మార్చుకొంటిరి. భౌతిక స్థితి గతులను లోబరచుకుంటూ, గత చరిత్ర నుండి పాఠాలు నేర్చుకుంటూ, ఆ గంతుక సంఘటనలకు తలవొగ్గుతూ, ధైర్యశాలియై, బ్రతుకుపై ఆశతో ముందుగడ సాగిస్తుంటాడు. కనుక సమాజంలో మానవునిది బాధ్యతా యుతమైన కీలక స్థానం అదే సమాజ కేంద్రస్థానం అతడు సామాజిక అనుబంధాన్ని పొందుతూ స్వేచ్ఛాభిలాషిగా వుంటాడు. ప్రయత్న శీలుడై పురోగమించుచూ, సమానతను కోరుతాడు సంఘానికి తాను బాధ్యుడైయుంటూ సంఘం తనను పోషించాలని కూడ భావిస్తాడు. అందు కనుగుణంగా సంఘం మలచాలని, అధికారత్వం వహించాలని చూస్తాడు కనుక సమాజం పై మానవురాధార పడ్డాడు.

మానవునిపై సమాజ మాధార పడిందాయని నిర్ధారించటం కష్టతరం. అది వృధా ప్రయాస కూడాను. అయితే మానవుని గురించి సమాజ మేర్పడినదని మాత్రం చెప్పక తప్పదు.

సర్వజీవ రాసులలో శ్రేష్టతర మైనది మానవ జన్మ అట్టి మానవ జన్మ సమాజమునకు కేంద్ర స్థాన మైనది. కేంద్ర స్థితుడైన మనిషిని స్థూలంగా పరిశీలించినచో వ్యక్త మైనది. అవ్యక్తమైనది అని రెండు విషయములు స్ఫురించును. మనిషికి శరీరము. మనసు వుండాట వ్యక్తమైన విషయము నిర్వివాదాంశము. మనిషికి ఆత్మకూడ కలదనుట అవ్యక్త మైన విషయము స్వానాభవమేమో కాని, సర్వాను భవమని చెప్పుట కష్టము. అవ్యక్తమైన ఆత్మ పదార్ధమును ఆధారము జేసికొని ఆధ్యాత్మిక తత్త్వము ప్రచారములోనికి వచ్చింది.

ఆత్మ, పరమాత్మ, బ్రహ్మము, పరబ్రహ్మము, భగవంతుడు చాలా వరకు పరానయ పదాలుగా వాడబడినవి. ఇది అంతయు ఏకాత్మ భావనగా అద్వైత తత్త్వముగ ప్రాముఖ్యత వహించినది. ఈ ఆత్మభావన ఎక్కువగ ఉహాపైన విశ్వాసం మీద అధారపడినది- దాని నిర్వచనము మానవుని మనో వికాసాన్ని బట్టి, స్వానుభవాన్ని బట్టి, సామాజిక పరిస్థితులను బట్టి, వైజ్ఞానికాభివృద్ధిని బట్టి, శాస్త్రీయ దృక్పథాన్ని బట్టి మారుతూ వచ్చినది. ముఖ్యముగా మానవుని మానసిక వికాసాన్ని సామాజిక చైతన్యాన్ని బట్టి ఆత్మియిక విషయాన్ని వివిధ విధాలుగ బుక్కుల ద్వారా, ఉపనిషద్గాధల ద్వారా, పౌరాణికేతి హాసముల ద్వారా వర్ణించారు.ఇందులో అనుభవాల కన్న అల్లిక కథ లెక్కువగనున్నవి సత్యం కన్న సాహిత్యం పెంపొందింది ఏకాభిప్రాయం కన్న అనేకభిప్రాయ లెక్కువైనవి. అది నిర్వచనానికి

రూపాంతరాలనేకములు వెలసినవి. ఏమానవుని వ్యక్తిత్వోన్నత్యమునకై ఈ యాధ్యాత్మిక మాహామాత్రముగా మొదలైనదో తుదకా మానవునకై దూరం కాజొచ్చినది అంటే సామాజిక దృక్పథాన్నే విడనాడినది. సమాజానికి సమాజ కేంద్రమైన మానవునికి ఉపయోగపడని తత్వము వ్యర్థము గదా!

ఆచరణలో సమాజ దృష్టి లోపించినా, శాస్త్రములందు మాత్రం సమాజదృష్టి లేకపోలేదని పరిశీలన వలన తెలియగలదు. ముఖ్యంగా కొన్ని శాస్త్రాలు దైవ విశ్వాసం పేరుతో సమాజాన్ని శాసించుటకై యేర్పడినవి. ఉదాహరణకీ మనుస్మృతిని పేర్కొనవచ్చును రాజకీయ సాంఘిక నీతుల నిర్దేశించుట భారతాది ఇతిహాసముల ఉద్దేశమన వచ్చును. సామాజిక వర్ణ వ్యవస్థను సుస్థిర పరచుటకు భాగవతాది పురాణములు భగవద్భక్తి పేరట పుట్టిన వనుటలో సందేహింప పనిలేదు. అయితే సమాజ చైతన్యాన్ని ప్రగతిని పరిగణింపక, వ్యక్తిస్వేచ్ఛకు, వికాసానికి అడ్డువచ్చుచుండుటచే మార్పుకోరే మానవుడు నామమాత్ర శాస్త్రాలయెడ విముఖత జూపించ సాగాడు. సాంఘిక దృష్టిలేని శాస్త్రాలు నిష్ప్రయోజనమని విమర్శించాడు. ఇది గమనించిన చింతనాపరులు కొందరు శాస్త్రాన్ని సంఘపరంగా సమన్వయించటం మొదలు పెట్టారు, మహనీయులు కొందరు అధ్యాత్మికతలో సామాజిక దృకథాన్ని బాగ ప్రవేశ పెట్టారు, వారే సాంఘిక, మత, ఆధ్యాత్మిక సంస్కర్తలుగా పేరు గాంచారు.

మానవుడు శాంతి ధామం చేరుటకు భగవంతునితో పనిలేదని, వర్ణ విచక్షణ పాటించనవసరం లేదని, పంచనీతి సూత్రములను అష్టాంగ యోగముల ననుసరించిన చాలునని గౌతమ బుద్ధుడు ప్రబోధించాడు, పరిపాటిగ భావించినట్లు పవిత్ర మంత్రము రహస్యమైనది కాదని కుల

భేదముతో పనిలేక దాని నెల్లరు ఉచ్చరించ వచ్చునని సకలజనానికి తాను బహిరంగముగా ఉపదేశించి, పంచమ వర్ణస్థులను కూడ తన శిష్యులుగ జేకొన్నాడు. రామానుజాచార్యులు, గీతాది పురాణేతిహాసముల ఖండించి మానవులందరూ సమానులని ఎల్లరు ఏకేశ్వరుడైన పరమేశ్వరుని కొలుచుట కర్హత కలదని ప్రకటించి భక్తిసూచకమైన లింగ ధారణ కందరిని ప్రోత్స హించాడు. బసవేశ్వరుడు ఏకులమనినను వివరమడిగితే ఏమని చెప్పదు లోకులకు, దుష్టులకు, దున్నపోతులకు, అనికుల వ్యత్యాసాన్ని విడనాడి. హైందవేతరుడైన సిద్దయ్య సైతం తనకు శిష్యుడగుటకు తగునని, ఎల్లరను జేరదీశాడు, పోతులూరి వీరబ్రహ్మం చిల్లర దేవుళ్ళను చీదరించుకొని, ఉపనిషత్తు జ్ఞానాన్ని బొవల దాల్చి ప్రతి మానవుడు బ్రహ్మోపాసకుడు కావలయునని, ఆధునాతనంగా జ్ఞాన విజ్ఞానముల బోధించి క్రైస్తవ ఫకీరుల సంస్కారానికి గావించాడు రాజారామ మోహనరాయి కడుపు కాలేవాని మెదడుకు వేదాంతం పట్టదని, మానవసేవ ద్వారా మాధవసేవ జరుగవలెనని సమాజ చైతన్యము, శాస్త్రి విజ్ఞానము, ఆధ్యాత్మికత ముప్పిరిగా ముందుకు సాగవలెనని వివేచనా మార్గానికి బాటలు వేసాడు వివేకానందుడు, దేశ సేవలోను, దైవసేవలోను స్త్రీపురుష తారతమ్యము లేదనియు, హైందవ జాతి మనుగడకు అంటరానితనము మాయనిమచ్చ యనియు, దేశీయులందరిని స్వాతంత్ర్య పోరాటమునకు పురికొల్పి, సృజనాత్మకమైన సమిష్టి చైతన్యాన్ని సమకూర్చాడు. గాంధీ మహాత్ముడు ''ఒకే దైవం, ఒకే ప్రజ'' అను ఏకైక సూత్రంలో సాంఘికాధ్యాత్మిక చైతన్యాన్ని చేకూర్చిన కేరళ నారాయణ గురుదేవుల పంథా ననుసరించి ఆంధ్ర దేశమున ఆధ్యాత్మిక క్షేత్రంలో స్త్రీ, శూద్రాదులకు సమానార్హతల నొనగూర్చి నలుబదేండ్లపాటు కృషి సల్పారు. వ్యాస శ్రమాధిపతి మహర్షి సద్గురు మళయాళస్వాములవారు.

ఆంధ్ర దేశములో సంఘదృష్టిలో కూడిన ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలుగజేసిన శ్రీ సద్గురు మళయాల స్వాములవారు అడుగు జాడలలో అనేక (అంవదివాక) ఆశ్రమ సంస్థలు వెలువడినవి. లెక్కకు మిన్నగా వ్యక్తులు తయారైరి. అందులో గణింపదగిన వారు శ్రీ వాసుదేవానంద స్వాములవారు వారి ఆధ్వర్యములో పునాది బలపడి పెరిగిన కారంచేడు హరేరామ జపయజ్ఞ ఆశ్రమంకూడ విశిష్టమైనది. ఆశ్రమాధిపతిగాను సమాజాధ్యక్షునిగను పేరు గాంచిన శ్రీస్వాములవారు 9వ తేదిన కీర్తి కాములయిరి.

వాసుదేవానంద స్వాములవారు ఐక ప్రేమమూర్తి వారి హృదయము కోమలము. వాక్కు పవిత్రము క్రియహితకరము సామ్యవాదిగా, సౌమ్య జీవిగ బ్రతికారు కలవారని, లేనివారని విభేదించలేము. కుల విచక్షణ చూపి యెరుగరు. ఆధ్యాత్మిక జీవితమున కంకితమైరి. జ్ఞాన సమ భావనకు శ్రీ మళయాళ స్వాములవారిని ఆదర్శముగ గైకొని వారల స్మృత్యర్థము కారంచేడులో సువిశాల భవనమునకు పునాదులు వేసిరి ఆకట్టడము పూర్తి గాకముందే వారు గతియించుట కడు విచారకరము.

శ్రీ అనంగా నందుల అడుగు జాడలలో శ్రీ వాసుదేవానంద వారునడిచారు. వారందరూ ఒకతరము వారు జీవితాశయములను ఆచరణలో పెట్టి చూపారు. సిద్ధాంతపరంగా కొన్ని సామాజిక సూత్రములను ఆదరించారు, అనుసరించారు ఆరంభించిన వారు ఆచరించారు. అవి అంతటితో ఆగిపోరాదు. ఆ తరము తరువాత వారుకూడ మరింత ముందుకు పోవాలి సామాజిక చైతన్యాన్ని ఇనుమడింప జేయాలి. ఏరంగములోనైనను ఈనాడు సాంఘిక సమత్వంపాలు బాగ పెరగాలి. సాంఘిక దృక్పథం ఆరంభించిన వారితోనే ఆగిపోయినచో ఆధ్యాత్మికమునకే అవసానదశ ఆరంభమైనదని అనవంతము జ్ఞాపకం చేసికొనవలసి వుంటుంది.

(సద్గురువాణి – అక్టోబరు 1980.)

(బ్రహ్మీభూత శ్రీవాసుదేవానంద స్వాములవారు సద్గురు శ్రీమలయాళ స్వాములవారి శిష్యులు శ్రీ మలయాళ సద్గురు సేవాసమాజ జీవిత సభ్యులు వారి నిర్యాణమును పురస్కరించుకొని వారికి మా శ్రద్ధాంజలిని సమర్పిస్తూ ఈవ్యాసాన్ని ప్రకటిస్తున్నాము. సం॥)

# నియమనిష్ఠా గరిష్ఠులు నా గురుదేవుడు

–శ్రీ బ్రహ్మచారి రాజశేఖరానంద.

"న శ్రేయో నియమంవినా" అనగా నియమములేనిదే శ్రేయము లేదని నేర్పుగానేనేర్పి, ప్రేమగా పాలించి, తాను శ్రేయోమార్గగామియై తదనుచరులకు నిరంతరం మార్గదర్శకులై విరాజిల్లినట్టి వారు నాయొక్క గురుదేవులు శ్రీ మలయాళ స్వాములవారు నియతి విష్ఠతనకు తానేర్పరచు కొనుట. తు, చ తప్పకుండ పాటించుట వారి జీవితమున గుర్తించదగిన గొప్ప విశేషము. నియమపాలురగుటచేతనే, తనయనుయాయులను నిర్మొగమ టంగా నియమించగలిగేవారు. సుమారు ముప్పది వర్షములు నేను శ్రీవారి నియమితసేవలో నిమగ్నుడనైతిని. నియమపాలనా బద్ధుడనైతిని నియమ నిగ్రహాదుల నెమ్మనమున గ్రహించితిని. నాటికిని నేటికిని వేజెప్ప గల్గినదేమంటే శ్రీవారి నియమములే శిష్యులకు శరణ్యములు, శిరోధార్యములు.

శ్రీవారి నైష్ఠికబ్రహ్మచర్యవ్రతము. నియమ నిష్ఠకే తలమానికము స్త్రీలతో నెప్పుడును ఒంటరిగా మాట్లాడియెరుగరు. మూడవ మనిషి మధ్యలో లేనిదే నెవ్వరితో మాట్లాడెడివారుగారు తరచు నన్ను మధ్యవర్తిగా నుంచుకొని మాట్లాడెడివారు, తమపనులు నెరవేర్చుకొనెడివారు. ఎంత సన్నిహితమైన శిష్యురాలితో నైనను ఒకే కారులో లేక ఒకే బండిలో కలసి ప్రయాణము చేసినట్లు నేనెరుగను. రాత్రిపూట స్త్రీలకు కబురు పంపవలసి వచ్చినచో ఒక లాంతరు తీసికొని, ఇద్దరిని తోడుగాతీసికొని వెళ్ళి మాట్లాడి రావలయును. బ్రహ్మచర్యపాలనలో కడుంగడు శ్రద్ధాళువైయుండెడివారు.

వటుడుగా, ఒంటరిగా పాదరక్షలు లేకయే కాలినడకను పుణ్యభారత క్షేత్రమును చుట్టివచ్చినవారు. అది ఒక దీక్ష మార్గమధ్యమున బడినయిడుమలకు తడబడి తల మొగ్గలేదు. దీక్షను సడలించలేదు. తిరుమల తీర్థములలో తిరుగాడుచు ద్వాదశ వర్షములు తపోదీక్షాబద్ధులై గడిపిరి. కొన్నినాళ్ళు నిరాహారియై, కొన్నినాళ్ళు అల్పాహారియై నిస్సత్త్వతో, నిర్జన ప్రదేశమున ధ్యానమగ్నులై యుండెడివారు. ఈశ్వరునిపై భారమువేసి కఠోర నియమాదులతో తపోవ్రతమాచరించినారు. తత్త్వజ్ఞానియైనారు.

ముందుకువేసిన యడుగును వెనుకకువేసి యెరుగరు. ఒకరి చేతి క్రింద తమచేతిని ఉంచి యెరుగరు. ఈ రెండు నియమాలు శ్రీవారిని శాపకునిగా జేసినవి. జీవితాంతము పాటించిన తన్నియమ పాలనచే ప్రతి విషయములోను విజయలక్ష్మి వారిని వరించినది. అపరిగ్రహమున అందె వేసిన చేయి "దేహి" యనుశబ్దము వారి వాఙ్మయమునలేనేలేదు. అయినను లక్ష్మి దాసియై శ్రీవారి పాదాక్రాంతయై యుండెడిది "ప్రపంచములోగల దేనికినిలొంగకుము. అట్లు లొంగనివానికి యీలోకము లొంగిపోవును" ఇది వారి జీవన దివ్య సూత్రము.

నిగ్రహపరుడు మాత్రమే అనుగ్రహించగలడు. ప్రేమాదరములతో మన్నన మర్యాదలతో, దయా దాక్షిణ్యములతో, సహనవాత్సల్యాదులతో శిష్యజనాళిని జూచుచు సాధన బోధవగరపిరి శిష్యవరము గురువర్యులనుండి కోరే అనుగ్రహమిదే కదా! స్త్రీలనెంతో ఆదరంగాజూచేవారు. వారివారి యవసరాలు యోగ్యతలు తెలిసికొని సముపాయములు జేయించెడివారు, 'అమ్మగార్లూ' అంటూ ఎంతో ఆప్యాయతతో సంబోధించెడివారు. ఎవరితో నైనను పరుండి సమాధానము చెప్పెడివారుకాదు. ఏయేవేళప్పుడు ఎవ్వరు వచ్చినను. విశ్రాంతిలో నున్నను పడక నుంచి లేచి కూర్చొని మాట్లాడెడివారు ఏవస్తువునైనను ఇచ్చి పుచ్చుకొనటలో వామ హస్తము నెన్నడు వినియోగించలేదు. తాము ఇతరులతో వ్యవహరించినపుడుగాని, ఇతరులు తమతో కార్యములు నెరపినపుడుగాని నిర్లక్ష్యతనెంతమాత్రము ద్యోతకము కానివ్వలేదు. అదిఒక పట్టుదల, మెళకువ!

త్యాగియైనవాడు మాత్రమే ధర్మకర్తగా నిర్వహించగలడు. అనుభవించుటకువలసినంత వస్తుసామగ్రితో సంపన్నమైయుండియు అది యంతయు దేవుని సొత్తు అనియు ఆశ్రమ ధనమనియుభావించి వ్యక్తిగత సౌఖ్యమునకెన్నడు వినియోగించలేదు. దైవసేవకు, భక్తి ప్రచారమునకు మాత్రము వ్యయము జేయుచు తాను నిర్లిప్తంగా, ధర్మకర్తగానిర్వర్తించిరి. వ్యాసాశ్రమమున విశాల నవీనభవనములున్నను తాము మాత్రమెన్నడో నిర్మించుకొనిన "నిష్ఠాశ్రమము"ను సామాన్య కుటీరమున నియమముగా, నిరాడంబరంగా నివసించినారు, వారికి పరుండుటకు పరుపులేదు, దిల్లమాత్రమే తలక్రింద దిండు కూడ లేదు చేయి మాత్రమే ధరించుటకు పాదరక్షలూ లేవు, పావుకోళ్ళూ లేవు. నిరాడంబరత మూర్తీభవించినట్లుగా జీవితాంతము గడిపినారు.

యుక్తాహారము, వివిక్తవాసము, బ్రహ్మచింతనము అను ఈనియమత్రయముతో జీవితమంతయు నియమబద్ధముగ నుండవలయును. శరీర పతన పర్యంతము ఈ మూడు నియమములను ప్రతివ్యక్తి యవలంబింపవలయును. సాక్షాదపరోక్షజ్ఞానము గలిగిన వారయినను ఈ నియమముల పాటింపకున్న పతనావస్థకు పాత్రులగుదురని పదేపదే హెచ్చరించెడివారు. మరియు 1) ఆహారనియమము 2) ఆత్మనియమము 3) నివాసనియమము 4) సంపర్గనియమము 5)కృత్యనియమము అను నీపంచ నియమముల గూర్చి అనుష్ఠానపూర్వకముగ ప్రబోధించిరి శ్రీవారు వాచా వేదాంతులు గాదు ఆచరణధీమంతులు.

ఇందు వారమని, ఏకాదశియని మాసశివరాత్రియని, కృత్తికానక్షత్రమని ఆయారోజులలో ఉపవాసనియమాదుల నాచరించెడివారు అందులో కొన్ని దినములు వరుసగా వచ్చినను నియమమునుల్లంఘించెడివారుకాదు-

"అనుటకొఱకు జీవించువాడు బద్ధుడు జీవించుటకొఱకు తినువాడు ముక్తుడు" అని శ్రీవారు సుప్రబోధించిరి.

నియమమును గూర్చి శ్రీవారి యభిప్రాయమును వినిపించి విరమించెదను. ఏ యొక్కటైనను వ్రతము, మంత్రజపము, ధ్యాననిష్ఠ మొదలగువానిలోనే యొక్క దానినైనను నియమముగనాచరించనిచో తరించలేరు జీవితమంతయు నియమబద్ధమై గడుపవలయునను దృఢ సంకల్పము గలుగు దశనుండియే మానవత్వము ప్రారంభమగును".

ఏకాదశి నియమము మహాప్రియమగుట చేతనేయనవచ్చును, భీష్మునివలె శయనైకాదశి రోజున శ్రీవారు మహానిర్యాణ మందిరి.

# ఆచరణమే అసంగానందము అసంగా నందుడే ఆశ్రమము

—శ్రీ బ్రహ్మచారి రాజశేఖరానంద.



అందరు తన యెడ ఆప్యాయత చూపాలని, తనను ఆదరించాలని అవసరంలో ఆదుకోవాలని ఎవరరైనను అనుకోవడం అతిసహజము. అయితే అందరి యెడ తానట్లుండ వలయునని అనుకోవడం చాల అరుదు. పరస్పర మిట్టిశాఖాకాంక్ష కలిగిన వారు అతి తక్కువమంది సతత సాధన వలన గాని ఇది సాధ్యపడదు. పరులయెడ ప్రేమ, సద్భావన కలిగి పరోపకారముతో సానుభూతి, శాంతి జూపు వారినే సత్పురుషులనియు, సేవా పరులనియు సద్గురువులనియు సంబోధించు చుంటారు. ఈ జగత్తుచో ఆకోవకు చెందిన వారే అస్మదాదర్శ సద్గురువు శ్రీ అసంగానంద స్వాములవారు, వరపు మహర్షి సద్గురు శ్రీ మళయాళస్వాములవారు.

తన ఆత్మోన్నతిని అవసరమైన దానినిగూర్చి ఇతరుల ఆత్మోద్ధరణకు అడ్డురాని దానిని గూర్చి తలంచుట ఒకమెత్తు, తత్సం కల్పాను సారముగ చేయుట మరియొక యెత్తు. ఆ చేయునది ఎల్లరకు ఉపయోగపడువట్లు బహి రంగముగ జరుపుట ఉత్తమోత్తమమైనది. చేయునది చెప్పుట, చెప్పునది చేయుట, చెప్పిచేయించుట ఆదర్శ ప్రాయము, గురు సాంప్రదాయము ననుసరించినవారు శ్రీ అసంగానందులవారు. ఆ చరణమే ఆ రూపు చెంది

ఆదర్శ ప్రాయులయిరి. తాను నమ్మినది వ్యష్టిగా చేయుట, సమిష్టిగా చేయించుట ద్వారా శ్రీ అసంగానందస్వాములవారు సద్గురు శ్రేష్ఠులైరి,

కనుకనే "సదాశివ సమారమ్భాం
శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యన్తాం
వన్దేగురు పరమ్పరామ్"

"శ్రీనారాయణ గుర్వాద్యాం
శివ లిఙ్గార్య మధ్యమాం
అసఙ్గానన్ద పర్యన్తాం
వన్దేగురు పరమ్పరామ్"

అని నిత్యము ధ్యానించుటకు కారణమైనది.

సత్సంప్రదాయాన్ని అనుసరించేవాడు, అనుసరింపజేసే వాడే సద్గురు వౌను. అతని విధానము మార్గ దర్శకమగును. అంతేగాని అతని సర్వావయాలు, సమస్త వాసనలు, సకల పరికరాలు, ఉచ్ఛిష్ఠ అవశిష్టాలు, పాద ప్రక్షాళన భౌతిక సపర్యలు ముక్తి మార్గము లనుకొనుటమేధ్యయము, మిధ్యాచారము కాగలదు.

శ్రీ స్వాములవారికి సనాతన ఋషి సంప్రదాయమనిన పరమ ప్రీతి. "ఓం బ్రహ్మాది భ్యో బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో/వంశఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః"యని నిత్యము ప్రాతః స్మరణలో ఘోషించుచుండెడివారు. కారణమేమన ఋషులు పురుషార్థముల-నెఱింగిన వారు సత్య

ధర్మములననుష్ఠించినవారు. పరవిద్య నవగాహన చేసికొన్నవారు, సనాతన వేద విజ్ఞానాన్ని జీర్ణింప జేసికొన్నవారు. మనన శీలురు. విశాల దృక్పథము కలవారు. వసుధైక కుటుంబ భావాన్ని వెలి బుచ్చినవారు. చరచరా సుఖాభిలాషులు. అన్నిటికన్న ముఖ్యముగా వారాచరణ పరులు. అందుకని ఋషి సంప్రదాయము ననుసరించి జీవించినారు. "ఋషి మతము వర్ధిల్లనుగాక" అని జయ గీతికల నాలాపింప జేసెడివారు.

1948లో విజయవాడ కృష్ణాతీరము ప్రథమ చాతుర్మాస్య వ్రతము సల్పుచుండగా నైజాంలో రజాకార్ల పల్లి విద్రోహచర్యలు విజృంభించినవి. దాని ప్రభావము చుట్టుపట్ల దేశమంతట వ్యాపించునని భయ భ్రాంతులు ప్రజలలో పెల్లుబికినవి విజయవాడ రైల్వే కూడలి, రాజకీయ వ్యాపార కేంద్ర మగుటచే ఈ అలజడులంతవరకు వ్యాపించినవి. చాతుర్మాస్య వ్రతము విఘ్న మగునని పలుగురు భావించిరి. అయితే సర్దార్ వల్లభాయిపటేలు చూపిన ప్రతిభతో రజాకార్ల దురాక్రమణ యణగిపోయి నైజామ్ రాజ్యం స్వాధీనమై శాంతి వ్యాపించినది అట్టి శాంతి సాధనకు శ్రీవారి సంకల్పము, దీక్ష, వ్రతము సాయపడిన వని శ్రీ విద్యా ప్రకాశానందాది పెక్కురు మహనీయులు పేరోలగమున ప్రసంగించి, శ్రీ స్వాములవారిని 'మహర్షి' బిరుదముతో ప్రశంసించిరి ఆనాటి నుండి శ్రీవారిని మహర్షి సద్గురు శ్రీ మళయాళ స్వాముల వారని సంబోధింప మొదలిడిరి. మహర్షి సంప్రదాయమును సార్ధకము చేసి స్వాములవారు సనాతన ధర్మ ప్రబోధము గావించిరి.

అయితే సనాతన ధర్మమనగా బ్రాహ్మణ మతమనియు, సాంప్రదాయిక ఆచార వ్యవహారము లనియు, ఛాందస మనియు నొక అపోహ గలదు. అట్టి ప్రచారమునకు తావులేకుండ "సర్వప్రాణికోట్ల హృదయములలో వెల్గుచుండు ఆత్మను, లేక దైవమును, తన ఆత్మను ఒకటిగ కను

గొనుటయే సనాతన ధర్మమగునని'' శ్రీవారు ప్రకటించిరి. మరియు తాను తరించుటయు ఇతరులను తరింప జేయుటలో ప్రయత్నించుటయునేది కలదో అదియే సనాతన ధర్మమగునని''ఎర్ణించిరి. ఇంకను ''ఇతరుల ఆత్మోన్నతికి అడ్డు పోవకయు, సాధ్యమైనచో సహాయము చేయుటయు,తన ఆత్మోన్నతికి అడ్డు కలిగినది తొలగించుటయు సనాతన ధర్మమగున''ని వ్యాఖ్యానించిరి. కనుక ఆత్మదర్మము, ఏకత్వము, సనాతనమైనవనియు, శాశ్వతమైన వనియు, ప్రగతి దాయకము లనియు, దేహధర్మము, అనేకత్వమునకు కారణములైన వర్ణాశ్రమ వైషమ్యములు ఛాందసమైనవనియు, స్వార్ధ పూరితములనియు, ప్రగతి నిరోధకములనియు బాగుగా గ్రహించవగును. ముఖ్యముగా శ్రీవారి ననుసరించువారు తమ యాచరణ ద్వారా, కార్యముల ద్వారా సర్వ సమత్వము చూపవలయునేగానీ, ఆచరణ లేకయే, మాటల గారడీతో, వికృత వ్యాఖ్యానాలతో ఎట్లున్నను తమది స మ దృ ష్టి య ని సమర్ధించుకోరాదు.

ఆచరణ యన్నది. చిత్త స్వాధీనత, క్రమ శిక్షణ, నియమ పాలన వలనగాని సాధ్యపడదు.

''మనోహిద్వివిధం ప్రోక్త శుద్ధంచా శుద్ధమేవచ, అశుద్ధం కామ సంకల్పం శుద్ధం కామ వివర్జితం''— అని రెండు విధములైన మనస్సులలో కామరహితమైంది అశుద్ధ మనస్సు' కామరహితమైనది' శుద్ధ మనస్సు, శుద్ధమగు చిత్తమే స్వాధీనము కాగలదు. కనుక కామ సంకల్పనజేయనీ మనంబు స్వాధీనమై యుండును. సార్థక నామధేయులైన శ్రీవారిలో అసంగము, ఆనందము సమకూరి యున్నవి. అసంగము అనుష్ఠితము, ఆనందము లబ్ధము ; సాధన సాధ్యము ; ఆచరణ అనుభవము శారీరకము' మానసికము అనిరెండు విధములుగ నుండును. ఆజన్మబ్రహ్మచారియై,

అఖండ బ్రహ్మచారియై శారీరక అసంగమమున కృతకృత్యులయిరి ఉపవాసము, అల్పాహారము, మితాహారము మొదలగు నియమములచేతను, ఏకాంతవాస, వివిక్తవాసములవలనను, జపతపధ్యానాది బ్రహ్మచింతనతోడను మానసిక అసంగత్వమును సాధించిరి. పన్నెండు వంచమాసములు, రోజులు పెద్దతిరునగ ప్రాంతముననే ప్రబల తపమొనర్చిరి. ఈ సిద్ధమహాయోగికి చిత్తము నిత్యము స్వాధీనమైయుండుటేగాక, సతతసాత్వికముగ, సమ్యక్ జ్ఞానమయముగ నుండెడిది.

క్రమ శిక్షణకు శ్రీవారికి పెట్టింది పేరు. ఆశ్రమ భక్తులందరికీ ఇది అవగతమైన విషయము ఆయన ఎంత శిక్షణతో మెలిగేవారో శిష్యులనంత శిక్షణతో తీర్చిదిద్దెడివారు సోమరులను ఆశ్రమమున చోటులేదు ఆశ్రమమున నున్నను సంచారములో నున్నను. ప్రాతఃకాలధ్యానముల నుండి సాయంస మయమౌనదీక్షవరకు నియమిత దైవిక కార్యములో శ్రీవారి శిష్యభక్త విద్యార్థి బృందమంతయు నిమగ్నమై యుండవలసినదే. ఇక భోజనాది కార్యమును దైవపరంగా నిర్ణీత పద్ధతిలో జరుగవలసినదే. శ్రీమలయాళ చరణసన్నిధి గ్రంథం చదివినవారు వారి శిక్షణా విధానము వజ్రతుల్యమనియు దానివెనుక వారి హృదయము నవనీత సదృశమనియు గ్రహించగలరు. ఆయన ఆంక్షలు శిక్షలు స్వీకరించి అనుభవించిన వారిపుడున్నతాధ్యాత్మిక జీవన స్థాయిలో నుండుట గమనార్హము.

నామట్టుకు నాకు శ్రీవారిని గూర్చి స్మరిస్తుంటే ఆనాటి నుండి నేర్పిన చిన్నచిన్న నిత్యజీవిత విషయాలు జ్ఞప్తికివచ్చుచున్నవి. సాంబ్రాణి కడ్డీలు వెలిగించి వాని కొనలచివరవెలిగే మంటనార్పుట నుండి నిమ్మకాయ కోయుట బత్తాయి పండు వలచుట కొబ్బరి తరుగుట దీపము వెలిగించుట మొదలగునవన్నియు వ్యక్తిగత శ్రద్ధతో నేర్పి చూపి చేయించేవారు ఏ

కొద్ది మార్పు జరిగినా సహించేవారుకాదు. పిలిపించి ఒకటి రెండు మాటలతోనే "ఏయ్" అంటూ హెచ్చరించేవారు. శ్రీవారి నుండి నేగ్రహించినవి నాజీవితములో జీర్ణించిపోయినవి వారి అనుగ్రహము వలన బ్రహ్మచారినగుటచే షార్థికశక్తి భగవత్తాత్వము నాకెంతవరకు వంటబట్టినదో చెప్పలేను గానీ భౌతికలంపటలు మాత్రము తగులొ్కనలేదు. బ్రహ్మచర్యము వలన సాఫీగా సాదాగా సావకాశముగా సాధనకు త్రోవయేర్పడినది. "ఆత్మానియమము కావలయునా! అహారనియమ మవలంబించవలయున"ని అత్మకు ఆరహామునకు సంబంధమేర్పరచి ఆ సంబంధము చెడకుండా జీవితాంతము జాగరూకత వహించిరి. దేవేంద్రిమాదిసుఖాలకు లోనుకాలేదు లోకమునవానికి లొంగలేదు. అందుకే లోకమాయనకు లొంగిపోయినది. ఆయన అనుకున్నదేమియు ఆగిపోలేదు.

ఒకసారి ముఖ్యవిషయము లేకయే ముకా్కణికార్డు శ్రీవారికి వ్రాసినందుకు మితవ్యయమును గూర్చి హెచ్చరించారంటే విసృత విశేష వ్యాసా్శ్రమమును ముప్పదిమారు సంవత్సరములు ఎంతమిత వ్యయముతో నిర్వహించిరో యూహింపవచ్చును.

శ్రీవారి నియమాచరణయే ఆశ్రమ కార్యములన్నిటిలోను నిగూఢమై యుండును. వారి నిరాడంబరతయే ఆశ్రమమున ఆచరణ నీయమైనది. వారి ఆధ్యాత్మికధ్యేయమే ఆశ్రమమున కాలంబనమైనది. శ్రీవారే ఆశ్రమము ఆశ్రమమే శ్రీవారు ఆచరణమే ఆదర్శము ; ఆదర్శమే అసంగత్వము ; అసంగత్వమే ఆశ్రమము ఆశ్రమమే మనకాశ్రయము.



# సంస్కర్తగా సద్గురుమూర్తి

## సంస్కరణమనగానేమి?

ఎన్నుకున్న జీవితాంశమున కొనసాగుతున్న విధానములో మౌళికమైనట్టియు మొత్తం ప్రక్రియకు సంబంధించినట్టియు మార్పులజోలికి పోకుండా సమగ్రవిధానము క్రమాభివృద్ధి చెందుటకు అంతర్గతముగా చేయుమార్పును సంస్కరణ మందురు. ఇది తీవ్రముగనుండవచ్చును మందముగ నుండవచ్చును సహజముగ నుండవచ్చును. తెలిసి తెలియనంతగ జరుగుచుండవచ్చును. ఇది క్రమాభివృద్ధి. ఈ క్రమాభివృద్ధి బహుకాలములో అనూహ్యస్థితిలో ప్రస్తుతమున్న పరిస్థితిని పూర్తిగ వ్యతిరేకమయ్యేస్థితివైపుకు ప్రభావితం చేయవచ్చును. వెనుతిరిగి చూచినపుడు "అబ్బా మన విధానం ఇంత తారుమారైనదా" యని ఆశ్చర్యం గొల్పవచ్చును. ఇది పరిశోధనకుదయించేప్రశ్న. సంభ్రమము కూడ అతనికే కల్గుతుంది స్వల్పకాలములో జరిగే చిరుమార్పుకూడ సంస్కరణమే దీర్ఘకాలములో జరుగుమార్పుకూడ సంస్కరణమే తెలియకుండ జరిగే మార్పుకూడ సంస్కరణమే మార్పుప్రగతి సూచకం సంస్కరణ ప్రగతిమార్గం, ఒక పరిధిలో జేయు సిద్ధాంత విధానములో జరుగుమార్పు సంస్కరణ ఇందు త్యాగాలు కష్ట నష్టములు తక్కువ. ప్రస్తుతాంశములో సుగుణములననుభవించుచు దుర్గుణములను వగచుచు చలినీళ్ళకు వేడినీళ్ళుగా మార్పులను వాడుకుంటూ జరుపుకుపోవటమే ఇందులో ముఖ్యవిషయము

# విప్లవమనగానేమి?

ఈవిషయము నిచట చర్చించనవసరములేదు కాని వ్యాఖ్యానము గుర్తించు నిమిత్తము ముచ్చటించుట మంచిది. సంస్కరణవలె ఇదియును మార్పే అయితే శీఘ్రగతినికోరును తక్షణమేకోరును మూలములో మార్పును కోరును అందుచే మొత్తానికే మార్పు తథ్యము దీనికి వ్యతిరేకం పాలుహెచ్చు త్యాగాలు. కష్టనష్టాలు హెచ్చు. తీవ్రత,తీక్షత ఉధృతం అధికము సంస్కరణ కొమ్మలను వంచాలని, కత్తిరించాలని. గతితప్పించాలని ఫలపుష్పాలను ఎక్కువ పొందాలని. ప్రదర్శించాలని చూస్తుంది. విప్లవం మూలాన్ని ఛేదించి క్రొత్తరకం చెట్టును నాటాలని చూస్తుంది. భవనాన్ని రిపేరు చేయుంచటం సంస్కరణమయితే భవనాన్నికూల్చి క్రొత్తది కట్టటం విప్లవమవుతుంది. సంస్కర విధాయకమైతే విప్లవం విధ్వంసకమవుతుంది.సంస్కరణ అభ్యాసమయితే, విప్లవం వైరాగ్యమవుతుంది. కొద్దిరక్తాన్ని సప్లయిచేయటం సప్లిమెంటు చేయటం సంస్కరణైతే క్రొత్త రక్తాన్ని పూర్తిగా ఎక్కించటం విప్లవమౌతుంది, మనస్సును సరిచేయటం సంస్కరణమైతే మనస్సును పూర్తిగా మార్చటం. విప్లవమౌతుంది. సర్దుకు పోవటం సంస్కరణ. ఎదురు తిరగటం. విప్లవము దీనినిబట్టి సంస్కరణకు విప్లవమునకు గల విభేదం అర్ధమవుతుంది

# సంస్కృతి-సంస్కరణ-నాగరికత.

సంస్కృతి-సంస్కరణ నాగరికత-నవీనత- ఒకే ప్రక్రియ యొక్క పరిణామ రూపములివి పరిణామ గోచరము గనక ప్రాథమిక దశను పట్టుకొని ఇదియే సంస్కృతియనుట నిర్హేతుకము అది సహజ పరిణామము. క్రమాభ్యుదయము

సంస్కరింప బడినదే సంస్కృతము. మేలిమియగునట్లు చేయుట సంస్కారము కృషి చేయుటకూడ సంస్కారమే గ్రామములో పుట్టిన వాడు గ్రామీణుడు గ్రామ్యమును సంస్కరించితే నాగరికత యేర్పడినది. మట్టిమున్నగు వాటిలో కలిసియున్న ముడిసరుకును పరిశుభ్రముచేసి వేరుచేసినచో మేలిమి బంగారము తయారగును. మేలిమి బంగారమునకు కొంతతగరమును కృత్రిమ పదార్థమును కలిపితే వాడుకొనుట కాకర్షణనిచ్చే సువర్ణమేర్పడును. దానికి పాలిష్ పెడితే దగదగ మెరియను. ఇదంతయు సంస్కరణయే సహజమైనస్థితిని మానవుని పరిస్థితులకు అవసరాలకు తగినట్లు గా మార్పు జేసుకొనుట సహజమునుండికొంతకృత్రిమము యేర్పడుచున్నది మార్పుతోకూడిన ఈమేళవింపేసంస్కరణము గతాన్నిమార్పు జేయుట నాగరికత నాగరికతద్వారా లభించిన గతమే నవీనత సంస్కరణద్వారా క్రమంగా మార్పుజెంది ఈ నాడు ముందునిలిచినదీ నవీనత. గతాన్ని విస్మరింపజేసేదికూడ నవీనత. ఇది విప్లవము ద్వారా

యేర్పడేనవీనత నవీనతనే అధునాతన మందురు. సనాతనము కానిది అధునాతనము.

సంస్కరింపబడినది సంస్కృతి. దాని కుపయోగించిన విధానంసంస్కరణసంస్కరణయొక్కఫలితమేనాగరికత నాగరికత యొక్క లక్షణము నవీనత భౌతిక మైనదానిని మానసిక మైన దానిని. అధ్యాత్మ విషయమును ఈ మాదిరిగా అన్వయం చేసు కోవచ్చును.

## హేతువాదము

సంస్కరణమునకును. విప్లవమునకు ప్రేరణ హేతుదృష్టి ఇదిఎందుకు ? ఎంతవరకు సమంజసము? అనే ప్రశ్నలతో ఆరంభ మవుతుంది. సంస్కరణకు ఊపిరిమైన హేతువు పరిమితమైనది. కొన్ని బంధనములకు లోబడియుండును. విప్లవమునకు సంబంధిం చిన హేతువు అపరిమితమైనది సమగ్రమైనది ఇవిఆదియనక అనుబంధ విషయములనన్నిటిని పరిశీలించి తేల్చుకుంటుంది. ఒక పరిధిలో ఆగిపోయేది సంస్కరణహేతువాదము పరిధులు దాటి పోయేది విప్లవ హేతువాదము. ప్రశ్నకు లభించే సమాధానమే సంస్కరణకుగాని, విప్లవమునకుగాని దారితీస్తుంది. ఏదైనాహిత వును కలిగించేది హేతువు. మౌఢ్యము హేతురహితమైనది. అందుకే మూఢాచరణ హేతువాదమునకు నిలబడదు. ప్రశ్న వేయుధోరణియే హేతువాదము.

జరుగుచున్న విధానమును కాదని విరమింప జేయుట లేక నూతన విధానమును ప్రవేశపెట్టుట హేతుదృష్టి వలననే బుద్ధుడుగాని, ఏసుక్రిస్తుగాని, మహమ్మదుగాని, దయానందగాని అద్వైత శంకరుడుగాని, రాజారామ్ మోహన్‌గాని, కందుకూరి గాని, గాంధిగాని, వారివారి రంగాలలో అప్పటికి హేతువాదులే వారిపరిధులు వేరుగావచ్చును. కొన్ని సంస్కరణ రూపమునను కొన్ని విప్లవాత్మకముగను నుండవచ్చును. హేతువాదులనబడిన మార్క్స్, ఏంగిల్స్, రాయ్, గోరా, ప్రవేశపెట్టిన విషయాలను కాలాంతర ప్రభావమున ఖండించు ఆధునాతన హేతువాదము బయలు దేరవచ్చును.

శ్రీవారు కొన్ని విషయాలలో హేతువాద దృష్టికలిగి అప్పటి స్థితిగతులను, తత్సంబంధ పూర్వశాస్త్రాధారములను ఖండించి లేక నూతనార్థమిచ్చి సంస్కరణవిధానమును ప్రవేశ నూత్నపంథాలో నడిపించారు. కనుక గతి తార్కికము సర్వదా ఎల్లరకు అవసరమే.

## శ్రీవారిదృక్పథం

శ్రీవారిది సౌమ్యదృష్టి సునిశితమైనవాదం లోలోన తీవ్రమైన దృక్పథం అయితే నిబంధనలకు సిద్ధాంతములకు లోనైనది. సనాతన సిద్ధాంతములకు ఆధునాతనముగ అర్థము అమర్చుకొని అనుసరించుట వారి ఆంతర్యము. సనాతన హైంద

ప ధర్మములవలడిన వర్ణాశ్రమ నియమములను ఉల్లంఘించక, ఆవలయములో సమత్వము సార్వజనీత చేకూర్చవలయునని నూత్న భాష్యముచేసిరి.

పూర్వీకుల వలెనే వ్యక్తినిష్ట గలవారు వ్యక్తిగతమైన ముక్తిజీవిత లక్ష్యమని విశ్వసించినవారు. అయితే హిందూమత ఆధర్మములకు అనుగుణ్యముగ ప్రతివ్యక్తి అముక్తికాంతను వరించుట కర్హతయున్నదని నమ్మినవారు. అందుకే 'యేజనాః' అన్నపుడు పజనులనగా స్త్రీగాని,పురుషుడుగాని, బ్రాహ్మణుడుగాని, బ్రాహ్మణేతరుడుగాని, యతిగాని, గృహస్థుగాని. అన్ని వ్యక్తుల మధ్య వ్యత్యాసములేకుండా చెప్పారు. అంతేగాదు వ్యక్తిపొందే లాభం సమిష్టికూడ పొందాలని కోరారు.

హిందూమత పరిధిలో ఆధ్యాత్మిక సంపదను ఆయత్తం చేసి కోవాలను కొన్నారు. శ్రీవారు ఆధ్యాత్మికవిద్య అగ్ర వర్ణాలవారికి మాత్రమే అర్హతమైనది గాని అడుగువర్గాల వారికి అందరాదని ఆదినుండి ఆంతుఉండేవి. అది అక్రమమన్నారు. ఆసంగానందులు. ఆధ్యాత్మిక విధ్యనుతాను అభ్యసించి అందరికి అవకాశము కల్పించారు.

ఇకపోతే స్త్రీ కు మనువు విధించిన క్రూరమైన ఆక్షేపణలను శ్రీవారు త్రోసిపుచ్చిరి సర్వసందలకు, సర్వసంపన్నులకు మాతృభూమి, మాతృదేవతలు కారణథముకాగా ప్రధమ గౌరవ

స్థానము పొందిన స్త్రీలకు సంస్కృతవిద్యకు ఆధ్యాత్మికరంగము నకు దూరము చేయుట సామాజికమైన చేటుకాదాయని తర్కించారు. ఎల్లరకు అవకాశం కల్పించి మహిళామణులకు మాన్యులైనారు.

## స్వయంభోద

తనకు తానియమించుకుంచు కున్నారు శ్రీవారు తనకు తాబోదించుకున్నారు ముందుగ తాను ఆచరించి ఇతరులకు చూపాకు స్వయంశిక్షణ ప్రప్రథమము పరశిక్షణ ద్వితియము సర్వజనీనమైన క్రమశిక్షణ కృతియం తానుశిక్షణ,పొంది పిదప బోధించారు శిక్షణనుండి తొలగకుండుటకు ముందు స్వయంబోధ తరువాత పరోపదేశము.

తాను శిష్యులు, భక్తులు-ఈవరసలో అచరణాత్మక ప్రభోధమును గావించారు,

తాము నమ్మిన మతవిశ్వాసము ననుసరించినారు. ఇతరుల విశ్వాసమును విమర్శించలేదు కానితనకు అడ్డువచ్చినచో సహించ లేదు. శ్రీవారు విభజనచేయని వ్యక్తివిబేదించని విశ్వాసి.

ఇకపోతే కులవిచక్షణ యననేమి శ్రీవారి యెుకలో లేదు.కులముంచే‌కదా కులవిచక్షణ చూపటానికి హిందువుడయిన వానికి కులంలేకుండా ఉండదు. కాని అకులముయొక్క ప్రమే

యము శ్రీవారికి లేకపోయింది కులమును ప్రయోగించ నవ సరము లేకుండెను కులముయొక్క ప్రయోజనమును వారు కోరలేదు సరిగదా దానిని గురిగింప వలసిన యవసరగాని ఒరుంఢ వలసిన అక్కరగాని వారు కల్పించలేదు జీతములో దాని యవ సరము లేదని నిరూపించినారు కనుకనే వారెవరో కులపరంగా ఎవరును ఎరుగరు శిష్యులు అనుచరులు సర్వజనులు ఈగురుతర సద్గుణమును సర్వదా అనుసరించవలయును ఇది సంస్కారణలో శ్రేష్టమైన మార్గము. **Silent revolution** నెమ్మదిగ నిశ్శ బ్దముగ ఆచరణాత్మకంగా మార్పును కోరటం అదితన వద్దనుండి ప్రారంభం కావటమే స్వయంబోధ అయితే అది యంతటితో ఆగక ఇతరులకు చాపక్రిందనీరులాగ పనిచేసినది. ఒకరిని ఒకమారు అనకుండ తన ఆచరణద్వార పరులలో మార్పును కలుగజేసారు'

హితబోధ

శ్రీవారు తాము నమ్మిన ధర్మమును ఇతరులకు బోధించుటకు వెనుకాలేదు, ఇతరులకు సందర్భోచితంగా హితబోధజేసి, వారికివారు స్థిరపడుటకు స్వేచ్ఛనిచ్చేవారు. వత్తిడిచేసేవారుకాదు వ్యతిరేకత కొని తెచ్చుకొనేవారు కాదు. కనుకవారిబోధహితవుగానుండేది.

శ్రీవారు లోకము యెడకడుంగడు గమనికతో మెలిగెడివారు సంస్కారణ ప్రవేశపెట్టనను లోకమెట్లుగ్రహించుచున్నది ప్రజాభి ప్రాయమెట్లున్నదియని తెలుసుకొనుచుండెడివారు లోకమునకు వెరచినచో సంస్కారణ కుంటువడును. శ్రీవారు కొన్ని సంస్కారణ లను కొలదికాలము తనవరకే పరిమితం చేసుకొని ఇతరులర్ధంచేసి కొని అవలంభించుటకు కొంతస్వేచ్ఛనిచ్చారు, తద్వారా ఇతరులు క్రమంగా భాగస్వాములగుటేగాక, తదనంతరమువారు శ్రీవారిని సంపూర్తిగా అనుసరించారు, విబేధాలకు విభజనమే తావులేకుండా పోయినది ఇది సంస్కారణవిధానమే, శ్రీవారు లౌక్యమెరిగినవారని

యుక్తాయుక్తముగా ప్రవర్తింతురని, నొప్పింపక తానొవ్వక తనవను లకు శిష్యులతో చక్కగ నిర్వర్తింప జేసుకొనెడివారని, అయినా తన సిద్ధాంతముతో రాజీపడి యెఱగరని విలక్షణముగ వారిని ప్రశంసించుట జరుగుచున్నది.

స్త్రీశూద్ర ద్విజబంధూనాం త్రాతా సంసారవారిధే ః
భక్తానది బోధనాద్యోసౌ, శ్రీ గురు శ్శరణంమమ ః

యని కొనియాడుతున్నారు శ్రీ విద్యానందులవారు

శ్రీవారి వాక్కు మహిళాలోకానికి వేదవాక్కు శ్రీవారి మాటనారీ లోకాభ్యుదయానికిబాటయని స్వర్ణోత్సవమునాడు శ్రీమాతానిరంజనా నందగిరివారు ఎలుగెత్తి ప్రతిధ్వనించారు.

## సమన్వయం

దోషము నుండి తొలిగించువారుగదా గురువులు ఒకవేళ వారు చెప్పెడి దోషము మనలో లేనిచో మనయదార్థస్థితి వారికి తెలియలేదనినెమ్మదిగా యుండవచ్చును. తనలోగల దోషములను సవరణ చేయతలంచు వారికి దూషణము భూషణమేయగును, స్తుతినిందలతో నేకత్వమెందవచ్చును, - ఇవి శ్రీవారి వాక్యములు

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థ ద్వేష్యబంధుషు ।
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే -

ఈ విధమైన భావనలతో శ్రీవారు సమబుద్ధి గలిగి సమన్వయ దృష్టితో కొనసాగెడివారు.

శాస్త్రార్థములను సాధ్యమేనవరకు తిరస్కరించెడివారు కాదుకాని తన సిద్ధాంతమున కనువైన శాస్త్ర వాక్యములను ఏరి వానికర్థము తెల్పి సమన్వయము జేసికొని. తనవాదమునకు బలము చేకూర్చుకొనెడివారు వ్యతిరేకముగనున్న సూత్రాలను. ఆచరణ పూర్వకముగ నిరాదరించి ప్రక్కకు నెట్టివేయుటయేగాని శుష్కవాద ధోరణి వారికి గిట్టదు.

తను నమ్మినది ఆచరించుట వారికి ప్రధానము అందుకు అనువైన సూత్రాలు వారికి ఆధారములు వీలయినచోట సమన్వయము చేసికొనుట ద్వితీయము ఇదివారి విధానము తనకేదియు అడ్డురాకుండ అనుకూలముగ జూచుకొనుటయే సమన్వయము. కేవలం పోరాటం వారి మార్గముకాదు ఆచరణలోనే ఆదీ ఇమిడి యున్నది.

శివకేశవులకు భేదము తెల్పినమనకు రాంరహీంలకు సమస్థాయిలో వమస్కరించిన మనకు విగ్రహారాధరులను విగ్రహనిగ్రహకులను ఒకచో జేర్చిన మనకు దేనిని సమన్వయం చేయాలన్న అసాధ్యమైన పనిగాదు !

## సమిష్టికృషి - సమాజశ్రేయస్సు

వ్యక్తి నిష్ఠనమిష్ఠి కృషి రెండును కావలెను వ్యక్తి స్వతంత్ర జీవనము చేయుచూ విశ్వాసముచొప్పున ఆత్మపరిశోధనజేసికొనుచు ముక్తినొందిటకు కర్హత కలిగియున్నాడు- అట్టిఅర్హత కెవ్వడును. అడ్డుకొనరాదు వ్యక్తి శ్రేయస్సు సమాజ శ్రేయనుతో ముడిపడి యున్నది పమాజాభిగావలెనన్న వ్యక్తి అభ్యునతి జెందవలె కనుక వ్యక్తి పురోభివృద్ధికి దోహదపడిన విషయములను సమాజము లోన్ను వారుకూడ గ్రహించి కృషిసల్పిన సమాజము ముందుకుపోవును వ్యక్తి సమాజము పరస్పర అధారభూతములు.

వక్తి శ్రేయస్సు పమాజశ్రేయస్సు సమాజశ్రేయస్సు వక్తికి రక్షణకవచము సర్వేత్ర సుఖినస్సంతు సర్వేసంతునిరామయ్యాసర్వే భద్రాణి పశ్యంతుసర్వేసర్వత్రనందతుఃఅనిచరాచరసుఖాభిలాషిగా జీవించి తనువు చాలించారు శ్రీమలయాళ సద్గురువరేణ్యుల వారు జన్మించి ఈనాటికి వందసంత్సరములు నిండినవి

ఇదియె శ్రీవారి శతజయంతికి నానీరజన మణిహారము.

# రచయిత శ్రీ జె. శ్రీరఘుపతిరావు

జననము : 1932 మే 10

జననీజనకులు : కీ. శే. జల్లినరసమ్మ, పెదరామయ్యగారలు

జన్మస్థానము : కోనేటిపురము, రేపల్లెతాలుక, గుంటూరుజిల్లా

విద్యాభ్యాసము : భట్టిప్రోలు ఉన్నత పాఠశాల, మద్రాసు లయోలా కాలేజి, గిండి ఇంజనీరింగు కాలేజి; B.E., M.I.E.

విద్యాబుద్ధులు : సోదరుడు కీ, శే. జల్లి వెంకటస్వామిగారు
గరపినవారు బాబయ్య శ్రీ రాజశేఖరానంద స్వామివారు

కుటుంబము : భాగస్వామిని గాయని శ్రీమతి జె. అన్నపూర్ణ BA
చిరంజీవులు సుజన, జనని, జనరంజన్

వృత్తి : ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు (నీటిపారుదల) తెలుగు గంగ ప్రాజెక్టు, నెల్లూరు.

ఆదర్శములు : సమత, మమత, మానవత. సంగీత, సాహిత్య సహేతుకతత్వ సేవాతృష్ణ.

రచనలు : గీతికాపుష్పాంజలి. శ్రీ మలయాళ సద్గురు చరణసన్నిధి, శ్రీ సద్గురు నామ సంకీర్తనము, అంత్యోదయ పంథా, శ్రీ సీతారామయోగిని జీవిత చరిత్ర, డా॥ అబేంద్కర్ కథాగానము, శ్రీ మాతా నిరంజనానందగిరి వారిషష్ట్యబ్ది జీవితము, జీవన సందేశము, వ్యాసాశ్రమ గీతాంజలి జనకుని విద్వత్సభ, మూర్తిత్రయ భారతి మున్నగు సంగీత రూపకములు.